# ముఖచిత్రం



**పడవల నారాయణరావు**

## చిత్రకారుని గురించి

చిత్రకారుడు పడవల నారాయణరావు, గుంటూరు జిల్లా, చెరుకుపల్లి మండలం, రాజపేటలో 1949వ సం॥లో జన్మించారు పల్లెటూరులో, సంప్రదాయకుటుంబంలో జన్మించిన ఈయనలో భారతీయ సంప్రదాయ సంస్కృతి వేళ్ళూనింది అది ఆయన ప్రవర్తనలో, రచనలలో, గీసే చిత్రాలలో ద్యోతకమవుతూ ఉంటుంది ఈనెల మిసిమి ముఖచిత్రం అదే విషయాన్ని అభివ్యక్తం చేస్తుంది.

1973 నుండి తెనాలి టి జె కాలేజీలో ఆచార్యులుగా పనిచేస్తున్నారు ఎంతోమందికి చిత్రలేఖనంలో శిక్షణ నిచ్చారు 1997లో జిల్లా ఉత్తమ ఉపాధ్యాయుడుగా, 1998లో రాష్ట్ర ఉత్తమ ఉపాధ్యాయుడుగా ఎన్నికయ్యారు. వీరి చిత్రలేఖనం వాస్తవికతను, మానవతను ప్రతిబింబిస్తుంది

''చిత్రాలలో మన సంస్కృతి - సంప్రదాయం'' అనే గ్రంధం అచ్చులో ఉంది

వీరి చిత్రాలు అన్ని తెలుగు దిన పత్రికలలోను ప్రచురితమయ్యాయి "Angles of Human Body" అనే గ్రంధాన్ని ఔత్సాహిక విద్యార్థుల కోసం రచించారు

**ముఖచిత్రం :** శకుంతలను కణ్వుడు మెట్టినింటికి పంపుతున్నదృశ్యం.

# మిసిమి

**"All that we are is the product of what we have thought" is "We are what we think." - Dammapada.**

సంపుటి 11 జనవరి 1999 సంచిక 1

వ్యవస్థాపక సంపాదకుడు : డ్హాక్టర్ **రవీంద్రనాథ్ ఆలపాటి**

## విషయసూచిక



విడిప్రతి రూ. 8/- వార్షిక చందా రూ. 100/-

ముఖచిత్రం : *"శకుంతలను కణ్వుడు మెట్టినింటికి పంపుతున్న దృశ్యం"*

Printed & Published by BAPANNA ALAPATI at Kala Jyothi Process Ltd.,
1-1-60/5, R.T.C. X Roads, Musheerabad, Hyd-20. Ph. 7645536
e-mail : misimi_m@hotmail.com
http : //www.misimi.com

సంపాదకుడు : **అన్నపరెడ్డి వెంకటేశ్వర రెడ్డి**

### Graft charge against award committee

# Nobel prize winner defends his work

On the eve of the annual Nobel prize ceremony to be held here on Wednesday, a Swedish doctor Michael G Koch has accused the Karolinska Institute, that awards the prize in medicine, of indugling in gross corruption in awarding the said prize to Dr Stanley B. Prusiner.

Dr Prusiner was awarded the prize for his discovery of prions, a form of protein that causes mad cow disease and other brainwasting conditions.

However, Dr Koch who seven years ago had warned about the mad cow disease has cast doubts on the importance of 'prions' as a cause of mad cow disease

Dr. Pursiner has defended his work on mad cow disease and said he believes his discovery might be a key to understanding diseases such as schizophrenia and alzheimer's

Unlike other disease agents, prions contain no genetic material. Their importance has been doubted by some, including a Swedish doctor whose criticism made front-page headlines yesteryear.

The prion concept (Probably) in the not distant future will be placed in science's wastebasket." Michael Koch wrote in an op-ed piece in the respected newspaper Dagens Nyheter.

Doubters will say that until they go to their graves, Mr. Prusiner said yesteryear. There's nothing I can do to help them.

Prions have been identified as causing bovine spongiform encephelopathy mad cow disease and a variant strain of creutzfeldt-jakob disease, the human equivalent. In both diseases, the brain turns spongy, leading to death.

His critics say the diseases must be caused by a virus.

Many people have looked for this virus..... It doesn't exist, he said. The disease is much better explained by the prion.

Although his research has not yet led to a cure for the diseases, Mr. Prusiner said, but the blueprint is becoming quite clear. I don't think it's decades away, I think it's years away.

Mr. Pursiner also said his research could help track down the causes of such widespread diseases as Parkinson's, Alzheimer's, schizophrenia and bipolar depression.

Concern over whether humans can contract cruetzfeldt-jakob from beef from infected cattle recently led the British government to ban sales of beef on the bone after Dec 16, 1997.

Continue Page No. 23

# ఆధునిక గ్రీకు సంప్రదాయం

( 1963 నోబెల్ పురస్కార స్వీకారోపన్యాసం)

మూలం :
జార్జ్ సెఫరిస్

అనువాదం :
యస్. ఎ. మహమ్మద్

నేనొక సజీవ వైరుధ్యాన్ని ఈ క్షణంలో నాకనిపిస్తున్నది శతాబ్దాలుగా ప్రఖ్యాతి గాంచినా, దాని ప్రస్తుత రూపంలో అంతగా వ్యాప్తి చెందని భాషలో నేను చేస్తున్న కృషిని ఈ విశిష్ట సమ్మానానికి అర్హమైనదిగా ఎంచి, స్వీడిష్ అకాడెమీ నా భాషకు నివాళులర్పిస్తున్నది - అందుకు బదులుగా నేను నా ధన్యవాదాలను పరాయి భాషలో విన్నవించుకుంటున్నాను

నేనొక చిన్నదేశ వాసిని. మధ్యధరా సాగర తీరాన నిలిచిన సమున్నత శిలా ప్రదేశం నాదేశం నా దేశవాసులకృషి, సముద్రం, సూర్యకాంతి తప్ప చెప్పుకుందుకు ఏమున్నాయి మా దేశానికి? అది చిన్నదేశమే, కాని దానికి తరాలుగా నిరంతరాయంగా వస్తున్న వేల సంవత్సరాల సుదీర్ఘ సంప్రదాయం ఉంది గ్రీకు భాష నిరంతరం వాడుకలో ఉంది చైతన్య రూపాలకు సంభవించే మార్పులన్నీ ఇందులోనూ జరిగాయి - అయితే ఇదెప్పుడూ నిలిచి పోలేదు మనిషిపట్ల మమకారం ఈ సంప్రదాయ లక్షణం, న్యాయం దాని ప్రమాణం పటిష్ఠ నిర్మాణాన్ని కలిగిన గ్రీకు విషాదాంత నాటకాల్లో తన పరిధుల్ని అతిక్రమించిన మనిషి ఇరినీస్ చేత శిక్షించబడ్డాడు ఈన్యాయ ప్రమాణమే ప్రకృతిలో కూడ ఉంది.

''హెలియోస్ తన పరిధి నెన్నటికీ అతిక్రమించడు అతిక్రమించాడా, న్యాయ దేవతలతన్ని పసిగడతారు'' అంటాడు హెరాక్లిటస్ ఈ తాత్వికుడి నిత్య సత్యాన్ని తలపోస్తే ఆదునిక శాస్త్రజ్ఞులు లబ్ధి పొందగలరేమో! ఈ భౌతిక ప్రపంచపు సూత్రసమేంతగా గ్రీకు ఆత్మలోనికి చొచ్చుకు పోయిన ఈ న్యాయ వివేక దృష్టిని చూసినేను చలిస్తాను. ''మనం అన్యాయం చేస్తూ వచ్చాం అందుకే దారితప్పాం'' అని గత శతాబ్దారంభంలో మా జ్ఞాని ఒకాయన అన్నాడు మా కవిత్వ సంప్రదాయాన్ని గౌరవించాలని స్వీడిష్ అకాడమి అభిలషించడం ముదావహం ఏ కొంత ప్రభవించినా, భీతి, అశాంతులతో తల్లడిల్లుతున్న వర్తమాన ప్రపంచంలో కవిత్వం ఎంతో అవసరం కవిత్వ మూలాలు మనిషి ఊపిరిలోవున్నాయి మన ఊపిరి మందగిస్తే ఏమవుతుంది? మనిషికి ఆత్మవిశ్వాసాన్ని కలిగించే క్రియ కవిత్వం. మన ఈ అశాంతికి కారణం దృఢవిశ్వాసం లేకపోవడమేనేమో అన్న విషయాన్ని మనం గ్రహించాలి ఈనాడు నిరాదరణ కారణంగా అనునిత్యం ఆరిపోతుందేమోనన్న ప్రమాదాన్నెదుర్కొంటున్న కవిత్వమనే మానవ ఘోషను వినవలసిన అవసరం మనకుంది అయితే ప్రతిమారు అది పునర్జన్మిస్తునే ఉంది ప్రమాదాన్నెదుర్కొన్న ప్రతిసారి దానికి ఆశ్రయం దొరికింది, నిరాకరించబడిన ప్రతిసారి అది సహజ ప్రవృత్తితో ఊహించని ప్రదేశాల్లో వేళ్ళూనుకుంది, దీనికి చిన్న ప్రాంతం, పెద్దప్రాంతం అన్న భేదం లేదు విశ్వవ్యాప్తంగా మనిషిహృదయంతరాళల్లో దాని స్థావరం ఆచారమనే విషవలయాన్నుండి పారిపోగల మంత్రవిద్య దానికి తెలుసు ఈ నిజాన్ని గుర్తెరిగినందుకు, కొన్ని భాషల పరిమితవ్యాప్తి అన్నది మనిషి హృదయ తంత్రుల్ని నులిమివేసే ప్రతిరోధం కాకూడదు అన్న విసయాన్ని గుర్తించినందుకు; నిజమైనవెరియోపూస్‌లా, షెల్లీమాటల్లో ''గంభీరసత్య సంధతో జీవనోపహతులకు న్యాయం'' చేయగలిగినందుకు స్వీడిష్ అకాడెమీకి నేను ఋణపడి ఉన్నాను

క్రమేణ కుచించుకుపోతున్న మన ప్రపంచంలో ప్రతి ఒక్కనికి ఇంకొకని అవసరం ఉంది ఎక్కడ

ఉన్నా మనిషి కొరకు మన అన్వేషణ సాగాలి థేబ్స్ ప్రయాణంలో ఈడిపస్‌కు ఎదురైన స్ఫింక్స్ పొడుపుకథకు ఈడిపస్ చెప్పిన సమాధానం ''మనిషి!'' ఈ చిన్న శబ్దమే భూతాన్ని సంహరించింది మనం సంహరించవలసిన భూతాలెన్నో ఉన్నాయి ఈడిపస్ ఇచ్చిన ప్రత్యుత్తరాన్ని గురించి ఆలోచిద్దాం

★ ★ ★ ★ ★

నాకు ఆత్మీయుడైన ఐరిష్ కవి, (1923 నోబెల్ బహుమతిగ్రహీత) డబ్లు బి ఏట్స్, స్టాక్‌హోమ్ నుండి మరలిన తరువాత తన స్వీడన్ యాత్రానుభవాన్ని ''ది బౌంటి ఆఫ్ స్వీడన్'' అనే శీర్షికతో అక్షరబద్ధం చేశాడు స్వీడిష్ అకాడెమీ నన్నీవిశిష్ట పురస్కారంతో గౌరవించినపుడు అదినాస్మరణ కొచ్చింది ''స్వీడన్ ఉదారంగా మాకొసగిన సహాయం'' గతంలో చాలా వెనక్కు వెళుతుంది నాదేశానికి మీరర్పించిన ఈ నివాళి గురించి తెలిసిన మరుక్షణం ప్రతి గ్రీకు జాతీయుడు, పరహితాభిలాషతో, ఓర్పుతో, మూర్తీభవించిన మానవతలో మీరు మా దేశానికి చేసిన మంచిని అది సుస్థిరిత నెలకొన్నపుడు మీ పురాతత్వ వేత్తలు చేసినది కానివ్వండి, సమరకాలంలో మీ రెడ్‌క్రాస్ సంస్థ చేసినది కానివ్వండి - మరవలేడు ఇటీవలి కాలంలో మీరు మా పట్ల స్నేహపూర్వక సంఘీభావంతో చేసిన వాటిని గురించి నేనిక మాట్లాడ్డం లేదు

మీ పాలకుడు, శ్రీశ్రీ మహరాజ గుస్తవ్ అడాల్ఫ్ VI సమ్మాన పత్రాన్ని నాకందించినపుడు, యువరాజుగా ఉన్నపుడతను ఏథీన్స్‌లోని ఆక్రొపొలిస్ త్రవ్వకాలకు తనవ్యక్తిగత సహకారాన్నివ్వ సంకల్పించినప్పటి క్షణాలు నాకు ఉద్వేగంతో స్మరణకొచ్చాయి ఈ ఉదార హృదయుణ్ణే నా శ్రేయోభిలాషి అన్నాను - ఎందుకంటే ఏథీన్ నాకో కవితను ప్రసాదించింది

మిసోలొంఘి పట్టణంలో, గ్రీసు స్వాతంత్ర్య సమరంలో అశువులుబాసిన స్వీడ్ జాతీయుల స్మృత్యర్థం ఒక శిలా ఫలకం అంకితం చేయబడింది ఈ శిలాఫలకం కంటే మా కృతజ్ఞత శాశ్వతమైనది

గత శతాబ్దారంభపు ఒక సంజవేళ జంటే ద్వీపపు ఒక వీధిలోని పానశాల వాకిట నిలబడి వృద్ధ బిక్షువొకడు జెరూసలేంలోని క్రీస్తు దివ్యసమాధి దహనంపై జనశ్రుతమైన ఒక పల్లె పదాన్ని గానం చేశాడు చేయి సాచి ఆ వృద్ధుడిలా ఆలపించాడు

**దహనం కాలేదు సుమా ఏసుని పరిశుద్ధ సమాధి**
**దివ్యకాంతి వెలుగు చోటు రగులునా ఏజ్వాలైనా!**

ఈ పాటవిని పరవశుడైన డయోనిసస్ సోలొమన్ అక్కడ పానశాలలో ఉన్న వారందరికి ఉచితంగా మద్యాన్నిప్పించినట్లు చెపుతారు ఈ దృష్టాంతం నాకు చాల ముఖ్యమైంది ఆధునిక గ్రీసు పునరుత్థానం ప్రారంభమైన కాలంలోనే ఔత్సాహికుడైన ఓ యువరాజు చేతుల్లో మా ప్రజలు పెట్టిన కవితాబహుమతికి ప్రతీకగా నేను దీన్నెప్పుడూ భావిస్తాను. ఈ ప్రతీక ఇంకా అసంపూర్తిగా మిగిలిన ఓ సుదీర్ఘ వికాసపు ప్రతినిధిగా నిలుస్తుంది

మేము స్వేచ్ఛావాయువుల్ని పీల్చడం మొదలైన నాటినుండి గ్రీకు భాషాభివ్యక్తిలో ప్రముఖులైన వారి గురించి నేను మీకు చెప్పదల్చుకున్నాను. నా వివరణ రేఖామాత్రంగా ఉంటే క్షంతవ్యుణ్ణే మీ సహనాన్ని నేను పరీక్షించదల్చుకోలేదు

అటిక్ ఉదాత్త కావ్యాలను చూచి దిగ్భ్రమ చెందిన అలెగ్జాండ్రియనులు రచనలో ఏదిసరి, ఏదికాదు అని బోధించడం మొదలుపెట్టడంతో మా ఇక్కట్లు ప్రారంభ మయ్యాయి భాష సజీవ రూపమని,

దాని ఎదుగుదలను ఎవరూ నిరోధించలేరన్న విషయాన్ని వారసలు పట్టించుకోలేదు అయితే, ఈనాటికీ కొనసాగుతూ వస్తున్న పలుతరాల పరిశుద్ధ వాదులను రూపొందించడంలో వారు నిజంగా సఫలురయ్యారు మా భాష, సంప్రదాయాల్లో నిరాటంకంగా ప్రవహిస్తూవస్తున్న రెండు ప్రధాన శాఖల్లో ఒకదానికి వీరు ప్రతినిధులు

రెండవది, ఎంతోకాలం నిరాదరణకు గురైన గ్రామ్య, పామరజన, మౌఖిక సంప్రదాయం ఇది మొదటి దానంత ప్రాచీనమైనదే దీనికి తనదైన లిఖితరూపాలు కూడ ఉన్నాయి నేనొకనాడు రెండవశతాబ్దానికి చెందిన 'పాపిరస్' పై ఒక నావికుడు తన తండ్రికి రాసిన లేఖను చదవడం తటస్థించి కదిలిపోయాను అందలి యదార్థత, ఆ భాషయొక్క సర్వకాలీనత నన్ను సమ్మోహపరిచాయి శతాబ్దాలుగా, పరిశుద్ధత, కృతక కావ్యశైలి అనే పెద్ద శవవస్త్రంలో శాశ్వతంగా ఊపిరందక మట్టివేయబడి అనభిహితంగా ఉండిపోయిన మానవ హృదయ స్పందనను చూసి ఖేదపడ్డాను మీకు తెలుసు, సామాన్యులకు బోధపడాలని, వారి అభిమానాన్ని పొందాలనే ఉద్దేశ్యంతోనే దైవవాక్యాలను, క్రీస్తు శిష్యుల బోధలను ఆనాటి పామరజన భాషలోనే రచించారు కాని ఈ శతాబ్దారంభంలో ఏథెన్స్ పట్టణంలో దైవవాణిని అనువదించినపుడు మానవ స్వభావ వైపరీత్యం సృష్టించిన అలజడిని చూస్తే ఆవేదన కలుగుతుంది ఈనాటికి కూడ దైవవాణి అనువాదాన్ని చట్టవిరుద్ధమైనదిగా ముద్రవేస్తున్నారు

ఈ రెండు ప్రవాహాలు బైజాంటైన్ సామ్రాజ్య పతనంవరకు సమాంతరంగా సాగాయి ఓవైపు హంగు ఆర్భాటాల బౌద్ధిక సంస్కారాన్ని కలిగిన పండితులుండగా మరోవైపు వీరిని గౌరవిస్తూనే తమస్వీయ వ్యక్తీకరణ రీతులను కొనసాగించిన సామాన్యులున్నారు బైజాంటైన్ యుగంలో ఈ రెండు ప్రవాహాల సమ్మేళనం జరిగినట్లు కనిపించదు ఈ సన్నివేశం మనకు పాలియోలోగ్స్ పాలనలోని సామ్రాజ్యం పతనమయ్యే ముందు దశలో కనిపిస్తుంది ఆకాలంలో సర్వోత్కృష్ట సామ్రాజ్యకళ, ప్రాంతీయమైన ప్రజాకళ మిళితమై ఒక అద్భుతమైన పునరుద్ధరణకు ప్రాణంపోశాయి

ఏమయినా, పతనానికి ముందు కాన్‌స్టాంటినోపిల్ ఒక సుదీర్ఘ మనోవేదనను అనుభవించింది చివరికది స్వాధీనమైనపుడు ఎన్నో శతాబ్దాలపాటు కొనసాగిన బానిసత్వం జాతి సమస్తాన్ని ఆవరించింది అప్పుడు ఎందరో పండితులు ''తమ పూర్వీకుల చితాభస్మాలతో నిండిన బరువైన కలశాలను మోసుకుని'' మన మీనాడు ''పునరుజ్జీవనము'' అని వ్యవహరిస్తున్న దాన్ని వ్యాప్తి చేసేందుకు పాశ్చాత్య దేశాలకు తరలి వెళ్ళారు తప్పో ఒప్పో మధ్యయుగాల నుండి ఆధునిక యుగానికి జరిగిన పరివర్తనను సూచించేందుకు మనం వాడుతున్న ''పునరుజ్జీవనం'' నిజానికి వెనీసు పాలకుడి అధీనంలో ఉన్న క్రీటువంటి కొన్ని ద్వీపాల్లో తప్ప గ్రీసులో తెలియదు ఆరవ శతాబ్దపు మధ్యకాలానికి అక్కడ శోభాయమానమైన జీవద్భాషలో, స్వీయ విశ్వాసాన్ని కలిగిన కవనం, పద్యనాటకం వికాసం చెందాయి. అదే కాలాన క్రీటు ద్వీపంలో ప్రముఖ చిత్రరచనా రీతులు వికశించాయి 'ఎల్‌గ్రీకొ' అని వాసికెక్కిన 'డొమెనికస్ దియోటొకొపోలస్' క్రీటు ద్వీపవాసి ఇదంతా చూస్తే కాన్‌స్టాంటినోపిల్ పతనం కంటే క్రీటు పతనం ఇంకా బాధాకరమైన సంఘటనగా తోస్తుంది

చివరకు 1204లో క్రూసేడుల చేతిలో చావు దెబ్బతిన్న కాన్‌స్టాంటినోపిల్ కొన ఊపిరితో మిగిలింది అందుకు భిన్నంగా క్రీటు జనజీవాలతో వెలిగింది చరిత్ర వేసే పాలికేకల్లో సురల మరల విధ్వంసమయ్యే దాన్ని పునర్నిర్మించేందుకు ప్రతిసారి పూనుకునే గ్రీకు జాతీయులను చూసినపుడు దుఃఖం, ఈదేశ భవిష్యత్తుపై విశ్వాసం రెండూ కలుగుతాయి. ఏ మయినప్పటికీ, 17వ శతాబ్ద మధ్యకాలానికి క్రీటు పునర్వికాస క్షీణదశ ప్రారంభమయింది ఆ కాలంలో ఎంతో మంది క్రీటు వాసులు

అయోనియన్ ద్వీపాల్లో మరి ఇతర భాగాల్లో తలదాచుకున్నారు వీరు కంఠస్థం చేసి తమవెంట తెచ్చిన పద్యాలు క్రొత్త పరిసరాల్లో, అక్కడి పల్లెపదాలతో కలసిపోయాయి వీటన్నింటిని చూస్తే, పనిపట్ల, సుఖం, దుఃఖం, ప్రేమ, మరణం పట్ల వారివైఖరి ఏమార్పు లేకుండా ఒకే విధంగా ఉన్నదని మనకు బోధపడుతుంది కాని స్వేచ్ఛ, సంపూర్ణమానవతలతో నింపిన వారి అభివ్యక్తిలోని నూతనత్వం, గ్రీకు ఆత్మ ఎంత స్వీయ విశ్వాసాన్ని కలిగి ఉంటూ వచ్చిందో మనకు స్ఫురణకు తెస్తాయి నేనింతవరకు దృష్టాంతాలేమీ ఇవ్వలేదు నిజానికి నా అనువాదకులకు నేనెంతో ఋణపడివుంటాను - వారివల్లనే కదా నన్నీనాడు మీరు గుర్తించగలిగింది - కానీ నా భాషను నాదికాని మరొక భాషలోనికి అనువాదం చేసినపుడు గుర్తించడానికి వీలు లేనంతగా జరిగే విరూపణాన్ని తలుచుకున్నపుడు నాకు గొప్ప విచారం కలుగుతుంది ఇప్పుడూ, అంతకుమించి నేనేమీ చేయలేనందుకు నన్ను క్షమించండి ఇది ఒక సన్నిహితవ్యక్తి మృత్యువు పై రాసిన చిన్న కవిత :

**నిను రక్షించేందుకు ముగ్గుర్ని కాపలా ఉంచాను: పర్వతం పై**
**సూర్యుడు, మైదానంపై డేగ, ఓడలపై ఉత్తరపు**
**నిర్మల పవనం. సూర్యుడస్తమించాడు;**
**డేగ నిదురపోయింది; ఓడలు నిర్మల సమీరాన్ని తరలించుకు పోయాయి.**
**అవకాశన్ని గమనించిన షారన్ నిను తీసుకు వెళ్ళిపోయాడు.**

నా మాతృ భాషలో ఉజ్వలంగా ఉన్న కవిత అస్పష్ట ప్రతిబింబాన్ని మాత్రమే మీ కివ్వగలిగాను ఇక్కడ మీకు ఆధునిక గ్రీసు పూర్వ నేపథ్యం గోచరిస్తుంది. అదే జంటే ద్వీపంపై ఒకనాటి సంజవేళ పానశాల వాకిట నిలబడిన వృద్ధ యాచకుడు డయోనిసస్ సోలోమస్‌కు ప్రసాదించిన వారసత్వం.

ఆధునిక గ్రీసు కవన చరిత్రలో వింతలకు, విడ్డూరాలకు కొదువలేదు. నావికుల, గ్రామీణుల దేశంలో కవిత్వం ఏ ఆచ్ఛాదనల్లేని మోటు పాటలతో ప్రారంభమై ఎంతో సహజంగా ఉండేది కాని దీనికి విరుద్ధంగా జరిగింది. అది జంటే ద్వీపంపై పుట్టిన 'పరమ సంపూర్ణం' అనే పిశాచం ఆవహించిన వ్యక్తితో మొదలయ్యింది.

సోలొమస్ ఇటలీలో విద్యాభ్యాసం చేశాడు. తన దేశకవిత్వం ఎదుర్కొంటున్న సమస్యలగురించి అవగాహన ఉన్న గొప్ప యూరోపియన్ అతడు. కావాలంటే అతను ఇటలీ భాషలో రచనలుచేసి యుండవచ్చును అందుకు ప్రోత్సాహం కూడ లభించింది. అయినా అతను ఇరుకు మార్గాన్నెనుకుని గ్రీకు భాషలోనే రచనలు చేశాడు. వ్యావహారిక భాషాభిమాని, పరిశుద్ధతా వాదానికి బద్ధవిరోధి ఈ విషయంలో ఇతని భావాలు ''దిపాయట్ అండ్ ది పెడాంట్'' లో నిక్షిప్తమైనాయి. నేనొకటి రెండు ఉదాహరణలిస్తాను.

''నా అంతరంగంలో స్వేచ్ఛ, భాష తప్ప మరేమయినా ఉన్నాయా!''

''ప్రజల భాషకు లొంగిపొండి; మీరు శక్తి మంతులయితే దానిపై విజయం సాధించండి ''

ఈ విజయయాత్రలో బయలుదేరిన ఇతను గొప్పగ్రీకు అయినాడు. సోలొమస్ రచించిన ''హిమ్నటు ఫ్రీడం'' ప్రారంభ పద్య భాగాలు మా జాతీయ గీతమయ్యాయి. భవిష్యత్తు గ్రీకు భాషాభివ్యక్తీకరణ పథ నిర్దేశకుడు సోలొమస్. అందుకే అతని వారసత్వం అంత విలువైనది. జీవద్భాషను మిక్కుటంగా అభిమానించిన ఇతను దానికి తాను స్వప్నించిన కావ్య గౌరవాన్ని కలిగించేందుకు

జీవితాంతం కృషి చేసాడు ఇతని కృషి ఒక్క మనిషి శక్తికి మించినది సోలొమస్ రచనల అసంపూర్తి భాగాలే మనకు మిగిలాయి సోలొమస్ తనతో సమాధి లోనికి కొనిపోయిన వజ్రాల ధూళి మాత్రమే ఇవి సోలొమస్ 1857లో స్వర్గస్థుడైనాడు పలుతరాల గ్రీకు రచయితలపై ఇతను చూపిన ప్రభావం అపారం

సోలమస్ సమకాలికుడు ఆంద్రియాస్ కాల్వోస్ గ్రీకు సాహిత్యకారులందర్లోకి ఒంటరివాడు జాంటె ద్వీపంలో జన్మించిన ఇతను చాలకాలం కొర్ఫులో నివసించాడు ఇతను రాసిందంతా అతని 30సం॥ల వయస్సులో ప్రచురితమైన 20 కవితల చిన్న సంకలనం మాత్రమే యవ్వన దశలో ఇతను ఇటలీ, స్విడ్జర్లాండ్, ఇంగ్లండ్‌లలో విస్తృతంగా పర్యటించాడు ఇతని ఆశయాలు ఉన్నతమైనవి నీతికి ఎంత అంకితమయ్యాడో, నియంతృత్వానికి అంత వ్యతిరేకి ఒక త్యాగభూమి ఆవేదన, వైభవం ఇతని కవిత్వానికి స్ఫూర్తి శైశవంలోనే మాతృమూర్తిని కోల్పోయిన ఇతను అంతఃచేతనలో మాతృ ప్రేమను దేశ ప్రేమతో మమేకం చేయడం చూస్తే హృదయం ద్రవిస్తుంది సంప్రదాయ కావ్యాభిమాని అయిన ఇతను ''క్రీటు కవితల వైవిధ్యలేమిని'' ఏవగించుకున్నాడు అతని భావ చిత్రాలు ఉరుముల్లా మెరిసి తక్షణ శక్తితో అతని కవిత్వాన్ని చీల్చివేసేట్లుంటాయి కొర్ఫులో కొంత ఒంటరి జీవితాన్ని గడిపిన అనంతరం ఇతను అయోనియన్ ద్వీపాలను శాశ్వతంగా వదలి వెళ్ళారు మరి గ్రీసు వైపు తిరిగి చూడలేదు ఇతన్ని తలచుకున్నపుడల్లా ఏకాంత ప్రదేశంలో, నల్లని వస్త్రాలు ధరించి, విపంచికను మీటుకుంటూ తిరుగాడే అనామకుడి చిత్రం నన్ను వెంటాడుతుంది ఇతని రచనలు మరుగున పడిపోయాయి నిస్సందేహంగా ఆనాడు ఏథెన్స్‌లో రాజ్యమేలుతున్న అవాస్తవిక భావకవితా ధోరణితో ఇతనికి పొంతన కుదరలేదు 1890 ప్రాంతంలో కోస్టిన్ పేలామస్ ఇతన్ని వెలికి తీసాడు అప్పటికి గ్రీసు పరిణతి చెందింది యువశక్తి ఉరకలు వేయడం ప్రారంభమయ్యింది సజీవ భాషకై ఉద్యమం విస్తృతంగా సాగింది సహజంగానే, అందులో అపశ్రుతులు దొర్లాయి సంవత్సరాల తరబడిసాగిన ఆందోళన సాహిత్య పరిధిని దాటి, వర్తమానపు ప్రతి పార్శ్వాన్ని ప్రశ్నించే స్థితికి చేరింది. ఈ ఉత్సాహం విద్యా విధానం వైపుక్కూడ మరలింది. సిద్ధంగా ఉన్న రూపాలను, భావాలను విసరి కొట్టారు ప్రాచీనులు వదలి వెళ్ళిన వారసత్వాన్ని కాపాడాలనే కోరిక ఉంది. కాని సామాన్యుల పట్ల ఆసక్తి పెరిగింది ఇవి ఒకదాన్నొకటి ప్రకాశింపచేయాలని భావించబడింది వర్తమాన గ్రీసు గుర్తింపు ఏమిటి అన్న చింతన ప్రారంభమయ్యింది. పండితులు, ఉపాధ్యాయులు ఈ ఉద్యమంలో పాలుపంచుకున్నారు. ఈ కాలంలోనే గ్రీకు జానపద సాహిత్యాధ్యాయనం జరిగింది సంప్రదాయపు కొనసాగింపుతోపాటు ఒక విమర్శనాత్మక దృష్టి ఉండవలసిన ఆవశ్యకతను గురించిన అవగాహన పెరుగుతూ వచ్చింది.

కోస్టిన్ పాలమస్ ఈ ఉద్యమంలో ప్రముఖపాత్ర వహించాడు ఇతను మనిషి చాల కురచన అయినా తీక్షణ దృక్కులతో, తన కంఠ ధ్వనితో ఆకట్టుకునే వాడు. అతని కంఠధ్వనిలో ఒక ప్రత్యేకత ఉంది అతను విస్తృతంగా రాసాడు అతని రచనలు దశాబ్దాల గ్రీకు సాహిత్య జీవితాన్ని ప్రభావితం చేసాయి అతను స్పృశించని సాహిత్య ప్రక్రియ లేదు - గేయం, ఇతిహాసం, వ్యంగ్య రచన ఇతను ప్రముఖ విమర్శకుడు కూడ ఇతనికి పాశ్చాత్య సాహిత్యాలలో అపారమైన జ్ఞానం ఉంది. ఇతని ఆగమనంతో, పరిశుద్ధతా వాది నిరోధించగా పేరుకు పోయిన ప్రాకృతిక శక్తి ఏదో గట్లు తెంచుకుని ఉరికి నట్లయింది దాహంగొన్న మైదానం పైకి వరద నీటిని వదిలినప్పుడు ఆ ప్రవాహం సరోరుహాలను మాత్రమే మోసుకు రావాలని ఆశించకూడదు! ఈయనకు మా సంస్కృతిలోని ప్రాచీన, బైజాంటైన్, ఆధునిక పార్శ్వాలన్నింటిని గురించిన లోతైన అవగాహన ఉంది అంతవరకు అనభిహితంగా ఉన్న ఎస్సే

విషయాలు ఇతడ్ని ఉక్కిరి బిక్కిరి చేసాయి అదే అతని ప్రపంచం దాన్నే అతను విముక్తం చేసాడు ఇంత విస్తృతంగా రాయడం వల్ల అతనికి హానిజరగలేదని కూడా నేను చెప్పలేను

కాన్‌స్టాంటైన్ కవఫి ఏలామస్‌కు భిన్నధ్రువం శబ్దంచే ప్రేరణపొందని కవుల్లో ఇతనొకడు ఈజిప్ట్‌లో వికాసంచెంది, ఈనాడిక్కడ అదృశ్యమౌతున్న హెలెనిక్ సంస్కృతికి ఇతను ప్రతినిధి ఇతని రచనల్లో ఒక చారిత్రక దృక్పథం కన్పిస్తుంది చరిత్ర అంటే గతించిన కాలపు వివరణ అన్న అర్థంలో కాదు వర్తమానంలో నిల్చి మన ప్రస్తుత జీవితంపై, దాని గమనంపై, గమ్యంపై వెలుగు ప్రసరించే చరిత్ర ఇతని మార్గం సోలొమస్, ఏలామస్ అనుసరించిన ప్రజాకళ కాదు, ఇతనిది పాండితి ప్రకండుల మార్గం ఇతని భాష, తన కుటుంబంలో, అలెగ్జాండ్రియా వీధుల్లో నేర్చుకున్న దాని సమ్మిశ్రమం భిన్న రకాల వ్యక్తులు, విశ్వాసాలు ప్రవహించడానికి వీలుండే ఎల్లలు చెరిపి వేయబడిన దేశాలను, యుగాలను ఇతను అభిమానించాడు. ఇతని కవిత్వం బోధపడినపుడు, అది వర్తమానాన్ని గతంలోకి ప్రసరింప జేయడమో లేక చరిత్ర అకస్మాత్తుగా మన వర్తమాన అస్తిత్వంపై దాడిచేస్తున్నదా అనిపిస్తుంది.

ఈ క్షణంలో నాకు, మీ నిజమైన కవి ఉదార హెలెనిక్ సంప్రదాయాభిమాని హ్యామర్ గుల్‌బెర్గ్ గుర్తుకొస్తున్నాడు ఇతనే కవఫిని స్వీడన్‌కు పరిచయం చేసాడు ఏంగెలీస్ సైకెలియానోస్‌ను నేను బాగా ఎరుగుదును. తన కవిత్వాన్ని గానం చేసినప్పటి అతని స్వర మాధుర్యం జ్ఞప్తికి వస్తుంది. ఇతనిలో ప్రాచీన కాలపు కవి గాయకుల అంశమేదో ఉన్నదనిపిస్తుంది కాని అతనికి మా దేశాన్ని గురించి, అక్కడి గ్రామీణుల గురించి గొప్ప అవగాహన ఉంది శబ్దానికి, ఒక పార్నాసస్ గొర్రెలకాపరికి, లేక ఒక పల్లె యువతి ప్రవర్తనకు, తాను జీవించే పవిత్ర ప్రపంచానికి మధ్య అనుబంధం ఏర్పరచడమెలాగో ఇతనికి బాగా తెలుసు

నేనీ సంక్షిప్త వివరణను, నాకు అత్యంత ప్రీతి పాత్రుడైన వ్యక్తిని గురించి చెప్పి ముగిస్తాను నేను కష్టాలలో ఉన్నప్పుడు, నిస్పృహ నన్నావరించినపుడు ఇతడు నన్నాదుకున్నాడు. ఇతను వైరుధ్యాల పుట్ట మేధావికాడు తాను క్రియాశీలకపాత్ర వహించిన గ్రీకు స్వాతంత్ర్యసమరంలో తాను కన్నదానిని నిక్షిప్తం చేసేందుకు 35సం॥ల వయస్సులో కొంత చదవడం, రాయడం నేర్చుకున్నట్లు ఇతను చెప్పుకున్నాడు. అతని పేరు అయోన్నిస్ మక్రియాన్నిస్. ఇతన్ని, మనిషికి జ్ఞానాన్ని బోధిస్తాయని నేను విశ్వసించే, పంచభూతాలతో ఆకృతి దాల్చిన, మాదేశంలోని ఆలివ్ వృక్షాలతో పోలుస్తాను. తనపేద తల్లి అడవిలో చిదుగు లేరుకుంటున్నపుడు పురిటి నొప్పులు రాగా తనకు జన్మనిచ్చిన వైనాన్ని ఇతను మనకు చెప్తాడు ఇతను కవికాడు కాని, ప్రతి సామాన్యుడి ఆత్మలో దాగి ఉన్నట్లు ఇతనిలో కూడ పాట నిక్షిప్తమై ఉంది ఇతని రచనలు రాయిపై రాయిని పేర్చి నిర్మించినగోడను పోలి ఉంటాయి వచనం రాయడమెలాగో ఇతన్నుండే నేను నేర్చుకున్నాను. రచనలో కృత్రిమహంగుల్ని ఇతను నిరసించాడు.

వీరందరిగురించి నేనెందుకు చెప్పానంటే, నా స్వీడన్ ప్రయాణం మొదలైన నాటి నుండి వీరి నీడలు నన్ను వెంటాడుతునే ఉన్నాయి. ఎందుకంటే వీరి కృషి శతాబ్దాలుగా శృంఖలా బద్ధమైన దేహం ఆ సంకెలలు తెగి పడిపోయినపుడు తన సహజకార్యకలాపం కొరకు చేసే అన్వేషణను, తడుములాటను తలపిస్తుంది నా వివరణకు ఎన్నో పరిమితులున్నాయి. అందులో సందేహం లేదు. సరళం చేసేందుకు విషయ విరూపణం చేసాను అదమాంతోయిస్ కొరాయిస్, అలెగ్జాండ్రోస్ పపాడియ మాంటిస్ వంటి ఎన్నో గొప్ప పేర్లను నేను ఉదహరించలేదు. అయితే స్వీయ ఎంపిక లేకుండా దేన్ని గురించయినా ఎలా మాట్లాడడం? నా లోపాలన్నింటిని మన్నించండి. మలుపు తిప్పిన సంఘటనలను మాత్రమే నేను స్పృశించాను. వీరితోపాటు, ఎన్నో తరాలకు చెందిన, భిన్న యుగాల్లో జీవించిన వారెందరో గ్రీకు

ఆత్మను, బహుముఖాలు కల్గిన గ్రీకు అభివ్యక్తినీ ఒక అడుగు ముందుకు కొనిపోయేందుకు తమ జీవితాలను ధారపోశారు ఈ మహనీయులే కాదు మరుగున పడిపోయిన వారు, నిర్లక్ష్యం చేయబడినవారు, ఒక విగ్రహం ముందు ఎంత భక్తితో అవనతులవులారో అంతే భక్తితో ఒక పుస్తకంపై వాలిపోయె నా దేశవాసులెందరిలోనో, ''భగవంతుని వరాలయిన అక్షరాలను'' నేర్చుకుందుకు సుదూర గ్రామాల నుండి గంటల తరబడి నడిచి బడికి చేరే పిల్లలతో నా సంఘీభావాన్ని ప్రకటిస్తున్నాను ఎందుకంటే ఒంటరిగా ఎవరూ ఏమీచేయలేరు నాకీ సంఘీభావం అవసరం ఎందుచేతనంటే నా దేశ ప్రజలను, వారి మంచి చెడులను అర్థం చేసుకోకుండా ఈ విశాల విశ్వంలో మరెవరిని నేనర్థం చేసుకోగలను?

మా ప్రాచీనులను గురించి నేను మీకేమీ చెప్పలేదు నేను మిమ్మల్ని విసిగించదల్చుకోలేదు పదునైదవ శతాబ్దం నుండి, బైజాంటైన్ పతనకాలం నుండి వీరు విశ్వమానవాళికి వారసత్వంగా మిగిలారు యూరోపియన్ సంస్కృతి అని మనం వ్యవహరిస్తున్న దానిలో వీరు మిళితమయ్యారు అయినా మానుండి ఎన్నటికీ వేరు చేయలేని అంశాలు కొన్ని మాకు మిగిలిపోయాయి హోమరు మాటలు ''నేనీనాడంటాను'', ''సూర్యతేజం'' చదివినపుడు మేధో ప్రయాసకంటే, ఒక సమూహిక ఆత్మనుండి ఉద్భవించిన పరిచయపు అనుభూతి ఏదో కలుగుతుంది అది అనువాదానికందని అనుభూతి ఎంత పరివర్తన చెందినా, వేల ఏండ్ల పరిణామానికి గురి అయినా మేము మాట్లాడేది అదే భాషకదా! యుగాల నుండి ఈనాటి వరకు పునరావృతమవుతూ వస్తున్న కార్యకలాపాల, స్వభావాల జాడలు ఈ భాషలో కన్పిస్తాయి. మా అందరిలోనూ ఒకే రక్తం ప్రవహిస్తున్నదని నేను అనను నిజానికి జాతి సిద్ధాంతాలను నేనసహ్యించుకుంటాను. అయితే మేమంతా ఒకే దేశంలో నివశిస్తూవచ్చాం, సాగరంలోకి వాలిపోయే అవే పర్వతాలను చూశాం బహశా నేను ''అలవాటు'' అన్న అర్థంలో కాదు అని చెప్పకుండా ''సంప్రదాయం'' అన్న పదాన్ని వాడాననుకుంటాను నిజానికి ఈ ''అలవాటుకు'' అతీతంగా ఈ ''సంప్రదాయం'' మమ్మల్నందర్నీ ఏకం చేస్తుంది

నా తరం గురించి కూడ నేను మీకేమీ చెప్పలేదు ఆశియామైనరు నుండి ఒకటిన్నర మిలియను ప్రజల మహాభినిష్క్రమణం తరువాత నైతిక పునఃశ్చరణ భారం ఈ తరం పైనే పడింది ప్రపంచంలోని అన్ని సౌభాగ్య వంతమైన ప్రాంతాల్లో వ్యాపితమైన మా జనాభా తిరిగి గ్రీసు ప్రధాన భూభాగానికి మరలటమనే గ్రీకు చరిత్రలోని ఒక అద్భుత ఘట్టానికి కూడ ఈ తరమే సాక్షి

చివరిగా, మా తరువాతి తరం వారి గురించి కూడ నేనేమీ చెప్పలేదు వీరి బాల్యాన్ని, యవ్వనాన్ని, గత యుద్ధం పిండేసింది వీరి సమస్యలు కొత్తవి, వీరి దృక్పథం కొత్తది. గ్రీసులో పారిశ్రామికీకరణ పెరుగుతోంది; జాతులు దగ్గరౌతున్నాయి; ప్రపంచం పరివర్తన చెందుతున్నది, దాని గమనం వేగవంతమవుతున్నది మానవ హృదయంలోని లేక వెలుపలి విశ్వంలోని అగాధాన్ని చూపించడమన్నది ఈ తరపులక్షణమని మనం చెప్పుకోవచ్చు దుఃఖాన్ని అనుభవిస్తున్న అప్రశాంత తరమిది వీరి కడగండ్లను నేనెరుగుదును. నిజానికి వీరు మా కంటే అంత భిన్నమైన వారేమీకాదు మా స్వేచ్ఛకై పోరాడిన రిఘాస్ ఫెరయోస్ మాకు బోధించాడు; ''స్వేచ్ఛాభావాలు మంచి భావాలు'' అయితే ఉప్సల విశ్వవిద్యాలయ ద్వారంపై చెక్కబడిన ''స్వేచ్ఛాభావాలు మంచివి, న్యాయభావాలు ఇంకా మంచివి'' అన్న మాటలను గురించి కూడ ఆలోచించమని నేను మా యువతను కోరుకుంటాను

ముగింపు కొచ్చేశాను ఓర్పుగా విన్నందుకు మీ అందరికీ నా ధన్యవాదాలు ''స్వీడన్ ఉదారత'' చివరకు నాలో నేను 'అల్పుడిని' అన్న భావాన్ని కలిగించినది - అవును యులిసెస్ సిక్లాప్స్‌కు ప్రత్యుత్తర మిచ్చినప్పటి అర్థంలో, గ్రీసు అనే గుహ్యా ప్రవాహంలో ''అల్పుడిని''

# మహాభారతంలో ద్రౌపది - ఒక పరిశీలన

- దమ్మాలపాటి వెంకటేశ్వరరావు

మహాభారతంలో వర్ణింపబడిన పెక్కుమంది స్త్రీలు తమ తమ విశిష్ట వ్యక్తిత్వ ప్రభావాలవలన మనకు కొట్టవచ్చినట్లు కనబడతారు కథారంభం నుంచి అంతమయ్యేవరకు సందర్భానుసారంగా వారు మనముందుకు వచ్చి తమ కాంతులను వెదజల్లి అంతర్ధానమవుతూ ఉంటారు ఇంత పెద్ద ఇతిహాస గ్రంథంలో వారు ఒక్కొక్కచోట కథా ప్రారంభానికి, మరొకచోట కథా గమనానికి తోడ్పడి తమ విధిని నిర్వహించి తెరమరుగునకు పోతూ ఉంటారు. అయితే వీరిలో చాలామంది నిర్వహించినది అనుషంగికపాత్రేనని చెప్పవలసి ఉంటుంది గంగాదేవి, సత్యవతి, కాశీరాజ పుత్రికలు మొదలగువారు కథా ప్రారంభానికి, అక్కడక్కడ ఆగిపోజూచిన కథకు ప్రాణప్రతిష్ఠ చేయడానికి ఉపయోగపడితే, కుంతి, ద్రౌపది, గాంధారి మొదలగు పాత్రలు తమ బహుళ ప్రయోజనాల దృష్ట్యా కరదీపికలై కథాగమన మార్గాన్నంతా వెల్లివిరియజేస్తారు. ఈ ముగ్గురిలోనూ ద్రౌపదిపాత్ర అత్యంత ప్రధానమైనదని వేరే చెప్పనవసరంలేదు

మహాభారతంలోని ముఖ్యఘట్టాలన్నీ ఈమె చుట్టూ పెనవేసుకొని తిరుగుతాయి ఒక్కొకచోట ఈమె కథలోలేని సందర్భాలున్నా అవి కూడ పరోక్షంగా ఈమె వ్యక్తిత్వ ప్రేరితాలేనని చెప్పవలసి ఉంటుంది ఇంతటి ప్రధానపాత్రనుగురించి జన్మ వృత్తాంతము, కథలో ఆమెకు గల స్థాన, ప్రతిష్ఠల విషయాలు సంప్రదాయికుల దగ్గరనుండి హేతువాదులవరకు చర్చనీయాంశాలే గాక వివాద స్ఫోరకాలయ్యాయి. ప్రస్తుత రచయిత కూడ ఈ విషయాన్ని సమీక్షించడానికి చేసిన ప్రయత్న ఫలితమే ఈ వ్యాస రూపధారణకు మూలం

## ద్రౌపది గ్రీకు కన్యయా?

భారతంలో ధృష్టద్యుమ్న ద్రౌపదుల జన్మ వృత్తాంతం వర్ణింపబడినది దాని ననుసరించి ద్రోణుని చేత అవమానింపబడిన ద్రుపదుడు రణరంగములో ద్రోణుని వధియించునట్టి కుమారుడు, అర్జునునకు దేవి అగునట్టి కూతురును పొందుటకు తపోసంపన్నులైన యాజోపయాజులను ఆశ్రయించి పుత్రకామేష్టి యజ్ఞము చేయించగా అందు మంత్రాహుతులచేత్పుట్టైన అగ్నిదేవుని వలన ధృష్టద్యుమ్నుడు, ద్రౌపది జన్మించిరని తెలియుచున్నది ద్రౌపది అసలు పేరు కృష్ణ. అగ్ని గుండమునందు పుట్టినందువలన ''యాజ్ఞసేని'' అని, యోని మార్గమున పుట్టని దగుటచేత 'అయోనిజ' అనిపేర్లు ప్రఖ్యాతమయ్యాయి ఈ జన్మక్రమమును స్వీకరించడానికి అభూతకల్పనలను, అద్భుతాలను విశ్వసించేవారు తప్ప ఇతరులెవరూ సిద్ధంగా లేరు. అంతేగాక చాలామంది సంప్రదాయికుల చేతకూడ ఇది తిరస్కృతము అటువంటప్పుడు ఈమె జన్మ వృత్తాంతానికి సహేతుకమైన వివరణ ఇవ్వవలసిన అవసరం సంప్రదాయేతరులకు ఉంది అసలు ఈ వివాదానికి కారణము 'అయోనిజ' అనుపదానికి యోని మార్గమునపుట్టనిది అని అర్థము తీయడమేమోనని ఈ రచయిత అభిప్రాయము. ఈ సమస్యను పరిష్కరించడానికి మనకు భౌగోళిక పరిజ్ఞానం కూడ అవసరమేమోనని నానమ్మకము.

## అయోనియా ద్వీపసమూహము :

మధ్యధరా సముద్రంలోని గ్రీకు ద్వీపాలలో అయోనియా ద్వీపసమూహాలున్నాయి ప్రక్కనే

---

**దమ్మాలపాటి వెంకటేశ్వరరావుగారు**, ఎమ్. ఎ (హింది), ఎమ్.ఎ (పొలిటిక్స్)
హిందీ లెక్చరర్‌గా చేసి రిటైర్ అయినారు. వీరిది బాపట్ల.

ఉన్న సముద్రంపేరు కూడ అయోనియా సముద్రమే ($38^0$ ఉత్తర అక్షాంశం - $20^0$ తూర్పు రేఖాంశం) పూర్వకాలంలో అయోనియన్లు, ఈటోనియనులను గురించిన వర్ణన గ్రీకు పురాణేతిహాసాలలో వస్తుంది ఆరోజులలో ప్రజలు స్థిరనివాసాలు లేకుండావలసబోవడం కూడ ఎక్కువగా ఉండేది అయోనియా ద్వీపాలున్న మధ్యధరా సముద్రప్రాంతమైన ''పెలొపోనీషియా'' ప్రాంతంలో ఈవలస ఎక్కువగా జరిగినట్లు గ్రీకు చరిత్రకారుడు థూసిడైడ్స్ (Thucydides) తన గ్రంథంలో వ్రాశాడు దీనిని బట్టి 'అయోనిజ' అను మాటకు అయోనియాలో జన్మించిన కన్య అని అర్థము చెప్పుకుంటే మనము పాతగందరగోళమునుండి బయట పడగలము అంతేగాక గ్రీకు స్త్రీలకు బహుళంగా 'అయోన్' అని పేరు ఉండడం కూడ గమనించదగ్గ విషయం

## ద్రుపదుని దత్తసంతానం:

ధృష్టద్యుమ్న, ద్రౌపదులు ద్రుపదమహారాజునకు దత్త సంతానమనే విషయాన్ని సంప్రదాయికులు కూడ చాలామంది అంగీకరిస్తున్నారు అగ్నిలోనుంచి పుట్టడమంటే అగ్ని సంస్కారయుతంగా దత్తత స్వీకరించడమని అర్థంచేసుకోవలసి ఉంటుంది. దీనివల్ల వారి ఘనత ఏ మాత్రం తగ్గదు ఈ సందర్భంలో వారిని రథారూఢులను గావించి మంత్ర ఘోషల మధ్య యజ్ఞ మండపాన్ని దాటించే సంస్కారం జరిపి ఉంటారు. యజ్ఞ వేదికకు ఆవల ఉండగా వారు ఇంకొకరి బిడ్డలు వేదికను దాటి ఇవతలకు వచ్చిన పిమ్మట శాస్త్రసమ్మతంగా వారు ద్రుపదుని సంతానం అవుతారు ఈ విధంగావారు యువతీయువకుల రూపంలో ద్రుపదుని ఇంటికి వచ్చారు. అగ్నిలోనుండి ఉద్భవించినప్పుడు ధృష్టద్యుమ్నుని వర్ణనతిలకించండి!

''జ్వాలాభీలాంగుడు, కరవాల బృహచ్చాపధరుడు వరవర్మకిరీ
టాలంకారుడు, వహ్నియపోలె, రథారూఢుడొక్క పుత్రుడు పుట్టెన్''
(ఆదిపర్వము, సప్తమాశ్వాసము, పద్యము 18)

ఈ వర్ణన మనకు ఏ అలెగ్జాండర్నో, ఎకిలీజ్నో స్ఫురింపజేయుట లేదా? ఇట్లు అగ్ని సంభవులైన వీరిద్దరికి 'ధృష్టద్యుమ్నుడు' 'కృష్ణ' యనుపేర్లు అందరూ వినునట్లు ఆకాశవాణి పలకడానికి అర్థము యజ్ఞవాటికయందు గుమిగూడి యున్న బ్రాహ్మణులు మంత్ర ఘోషలమధ్య ఆపేర్లు ఉచ్చరించిరనుట యుక్తియుక్తముగా తోచును.

ద్రౌపది ఉత్తరహిమవత్పర్వతప్రాంతపు స్త్రీ అనియు, పాండవులు సీథియనులని కొందరి యూహ, కానిద్రౌపది మధ్యధరా ప్రాంతపు అయోనియా దీవులలో జన్మించి యుండునని నాబలీయమైన అభిప్రాయము. ఆ జీవిక అన్వేషణలో సారవంతమైన భూములవైపు వలసబోవు జన ప్రవాహములోబడి భారతావనికి చేరిన ఒకానొక తెగకు చెందిన స్త్రీయై యుండవచ్చును అటు పిమ్మట తపః సంపన్నులైన యాజోప యాజుల ఆశ్రయము సంపాదించి ద్రుపదుని దత్తపుత్రికగా విలసిల్లి యుండవచ్చును

## ద్రౌపది బానిసయా?

బానిస అనగానేమనకు తక్షణమే స్ఫురించేది అమెరికాలోని నీగ్రోలు. ఇది మొన్నమొన్నటి వ్యవహారం పూర్వకాలం ఎన్నో నాగరిక రాజ్యాల ప్రజలు ఓటమికి గురై విజేతల చేతిలో బందీలై బానిసలుగా, సేవకులుగా జీవయాత్ర సాగించిన ఘటనలను మనకు చరిత్ర అందిస్తున్నది ఈ బానిసలలో ఎంతో మంది విద్యావేత్తలు తమ విజేతల సంతానానికి గురువులుగా ఉన్న సంఘటనలు

ఉన్నాయి. రోమనులు గ్రీకులను జయించిన తరువాత వారు ఎంతోమంది గ్రీకు తత్త్వవేత్తలను, వక్తృత్వకళా నిష్ణాతులను (Rhetoricians), నీతిజ్ఞులను (Ethics Teachers) బానిసలుగా చేసుకొని తమ పిల్లలకు విద్యాబుద్ధులు నేర్పించారు ఈసప్ నీతి కథలు ప్రపంచ ప్రసిద్ధిగాంచాయి Aesop గ్రీకు నీతి శాస్త్రజ్ఞుడు కాని రోము సామ్రాజ్యములో అతను ఒక బానిస కనుక బానిస అనగానే అనాగరికుడని గాని, ఆటవికుడు అని గాని అర్థము ఎంతమాత్రంకాదు, వారు కేవలం విజితులు మాత్రమే ద్వితీయ ప్రపంచయుద్ధానంతరం ఎంతోమంది జర్మనీ శాస్త్రవేత్తలు బందీలుగా సోవియట్ యూనియన్‌కు కొనిపోబడి అక్కడ శాస్త్ర, సాంకేతిక విజ్ఞానాన్ని సుసంపన్నం చేసిన సంఘటన మనకందరికీ తెలిసినదే బానిసత్వానికి ఇది ఒక ఆధునికరూపం

భారత కథలో ద్రౌపదికి కృష్ణ, యాజ్ఞసేని, అయోనిజ అని పేర్లు ఉన్నట్లు ఇంతకుముందు చెప్పుకున్నాము ఈమె నలుపు రంగు కలది అగుటచే కృష్ణయని పేరు వచ్చియుండవచ్చును యజ్ఞ వేదికనుండి సముద్భవించడంవలన యాజ్ఞసేని అని, అయోనియా ద్వీపంలో జన్మించడం వలన అయోనిజ అని ఈమె ప్రఖ్యాతి బడసినది భారత ఐరోపా భాషాకుటుంబానికి చెందిన భాషలలో 'య' కు 'జ' కు భేదంలేదు 'యమున', 'జమున' ఇందుకు నిదర్శనాలు, గ్రీకు, లాటిన్, ఇటాలియన్, ఇంగ్లీషు, ఫ్రెంచ్, స్పానిష్ మొదలైన ఐరోపాభాషలు, ఇకమనదేశంలోని సంస్కృతంతో సహా ఉత్తర భారతంలో మాట్లాడే భాషలు భారత ఐరోపా భాషా కుటుంబానికి చెందినవే అందుచేత 'అయోనియా' 'అయోనిజ'గా మార్పుచెందడంలో విశేషమేమీలేదు. రంగునలుపు అయినా ఈమె అత్యద్భుత రూపలావణ్య అనుటలో సందేహంలేదు అయితే ఈమెను గ్రీకు కన్యగాభావించినప్పుడు నలుపు రంగు ఉండుటకు అవకాశమున్నదాయను ప్రశ్న ఉదయిస్తుంది. దీనిని వివరించడానికి ఈ దిగువ కారణాలను పేర్కొనవచ్చు

1. ఇతర ఐరోపా దేశీయులతో పోల్చినప్పుడు గ్రీకులు అంతశ్వేతవర్ణులు కాకపోయినప్పటికి స్ఫురద్రూపులనే చెప్పాలి.
2 తమవద్ద బానిసలను ఉంచుకునే ఆచారం గ్రీసుదేశీయులకు బహుళంగా ఉండేది.
3 బానిసలు తమ యజమాని మన్ననలను బడసిగాని లేక తమ సేవా వృత్తివలన గడించిన ధనముతో కొంతకాలానికి తమ స్వాతంత్ర్యాన్ని కొనుక్కునేవారు

పై చెప్పిన కారణాలను బట్టి ద్రౌపది తమ స్వాతంత్ర్యాన్ని కొనుక్కొనిగాని లేక యజమాని మన్ననలను బడసిగాని స్వేచ్ఛను అనుభవించి యుండవచ్చును ఈమె బానిస అనుకోడానికి మరికొన్ని ఉదాహరణలు భారతంలో మనకు లభ్యమవుతాయి

1 ద్రౌపదిని ఐదుగురకు భార్యగా ఇవ్వడానికి నిరాకరించిన ద్రుపదుణ్ణి ఆమె పూర్వజన్మ వృత్తాంతమనే మిషతో ఏకాంతంలోకి తీసుకొనిపోయి కృష్ణద్వైపాయనుడు (వ్యాసుడు) ఒప్పింపజేస్తాడు. తన పుత్రికను ఇటువంటి అనార్య పద్ధతిలో వివాహం జరుపుటకు అంగీకరించడానికి ఎన్నోబలమైన కారణాలుండవచ్చు. ఇక్కడ వీరిద్దరివ్యవహారాన్ని పరిశీలిస్తే ఒక కారణం స్పష్టంగా బయటపడుతుంది. పాండవులు వ్యాసునికి స్వంతమనుమలు వారికి పెళ్ళి కాదనే భీతితో ద్రుపదుణ్ణి వత్తిడి చేయడం బ్రాహ్మణాధిక్యతను స్వీకరించే సమాజంలో ద్రుపదుడు లొంగిపోవడం ఆశ్చర్యకరమైన విషయమేమీ కాదు. అదీగాక ద్రౌపది ద్రుపదునికి స్వంత కూతురు కాకపోవడం కూడ ఆయన పట్టుసడలడానికి కారణంకావచ్చు.

2 కృష్ణుడు సత్యభామతో కలసి పాండవులను చూచుటకు కామ్యకవనంబునకు వచ్చినప్పుడు సత్యభామ ద్రౌపదితో ఏకాంతమున ముచ్చటలాడుతూ ఆమెను ప్రశ్నించిన తీరులో కూడ (అరణ్యపర్వము - పంచమాశ్వాసము - పద్యం 291, 292) సమకాలికులు ఆమెను భద్రమహిళగా భావించుటలేదని తెలుపుచున్నది ఈ సందర్భంలో ద్రౌపది తాను వేయుపనులు ఏకరువు పెడుతుంది అందులో అతిధి అభ్యాగతుల మర్యాదలు మొదలుకొని, బాండాగారమునుండి వచ్చిపోవు సరుకులు మొదలుకొని ఏనుగులు, గుఱ్ఱములకు సరైన ఆహారపానీయాదులు ఇప్పించుట వరకుగల ఎన్నోపనులు తాను అప్రమత్తతతో నిర్వహించుచున్నట్లు చెబుతుంది దీనినిబట్టి ఈమెకు పట్టమహిషి హోదా ఉందనుకుంటే పరిచారకుల మీద పర్యవేక్షణ చేయు పెద్ద హోదాకలిగిన వ్యక్తిగా కన్పిస్తుంది పైగా ఇటువంటి బాధ్యతలు తనకప్పగించి ''పరమ యశోధనులగు పాండునందనులు ఇష్టవిహారులై ఉందురట'' (అ పంచ 307). దీనిని బట్టి కష్టభూయిష్ఠమైన పనులు ఈమెకు అప్పగించి వారు తమ ఇష్టమొచ్చిన రీతిలో విహరిస్తారనుటను బట్టి వారీమెను రాణిగా భావించుటలేదని స్పష్టమగుచున్నది రాణి వాసానికి, అశ్వగజముల ఆహారపానీయాల ఏర్పాట్లు గురించి జాగ్రత్తతీసుకోవడానికి హస్తిమశకాంతం తేడా ఉంది

3 పంచ భర్తృక అనే భావన అప్పటి సమాజంలో ఎంత ఘృణితమో వస్త్రాపహరణ సమయంలో కూడ స్పష్టమవుతుంది ''భార్యకు దైవహితుండైన భర్త యొక్కరుండ యిది అనేక భర్తృకగావున బంధకి యనంబడు'' అన్న కర్ణుని వచనాలు (సభా, ద్వితీయ 229) ఈమె బానిసత్వం వైపు సంకేతించుతాయి ఒకవేళ పాండవ ద్వేషి అయిన కర్ణుడు ఈవిధంగా అనడం అసహజమేమీ కాదని కొట్టిపారవేసినా ఆసభలో నున్న ఇతర గురుజను లెవ్వరూ ఆమాటలను ఖండించలేదు

4 సైంధవుడు ద్రౌపదిని చూసి మోహించడం, వావివరుసలు కూడ తెలియక ఈమెను అపహరించడం కూడ సమకాలీనులు ఈమెకు పట్టమహిషి ప్రతిష్ఠను ఇస్తున్నట్టు కన్పించదు కథలో అనేక సందర్భాలలో ఈమె పురుషులను ఎదిరించి మాట్లాడిన ఘట్టాలున్నాయి. పతివ్రతా లక్షణాలలో ఇటువంటి ప్రవర్తన అనూహ్యం

5 శ్రీకృష్ణుడు కర్ణుని పాండవుల పక్షానికి రమ్మని ప్రోత్సహించినప్పుడు ద్రౌపది అతనిని ఆరవ భర్తగా స్వీకరించగలదని చెబుతాడు ఆమె స్వతంత్ర్య అనిగాని లేక పట్టమహిషి అని గాని భావించి ఉంటే శ్రీకృష్ణుడు ఆ ప్రతిపాదన చేసి ఉండేవాడా? ద్రౌపదిని గురించే ఈ ప్రతిపాదన ఎందుకు చేశాడు? సుభద్రను గురించి ఎందుకు చేయలేక పోయాడు? ఈ విషయాలన్నింటిని పురస్కరించుకొని ద్రౌపది పుట్టి పెరిగిన వాతావరణం భద్రమహిళా సమాజానికి దూరమైందని, తన సౌందర్యాతిశయముచే ఈమె కామప్రేరకయని, అనార్య అని, ద్రుపదునికి ప్రదత్తయని తెలియుచున్నది. ఇట్టి లక్షణాలు జీవితములో ఆటుపోటులకు గురియైన స్త్రీలయందే కాన్పించునుగాని, అసూర్యంపశ్యలైన రాజాంతఃపురకాంతలయందు మృగ్యము పైన ఉదహరించిన కారణాలను పురస్కరించుకొని ఈమె జన్మరహస్యము బానిసత్వము వైపునకే మొగ్గుతున్న అభిప్రాయము బలీయమగుచున్నది జన్మభూమిని వదలి, తన జీవితంతో బంతులాడుకున్న సమాజంలో ఆటుపోట్లకుగురై, హృదయంలో కుతకుతలాడుతున్న అగ్ని పర్వతాలను అణచుకొని, సమయం అనుకూలించినప్పుడు వాటికి విస్ఫోటక శక్తిని ప్రసాదించి ఒక మహాప్రళయానికి కారణభూతయైన ద్రౌపదిపట్ల మనకు సానుభూతికలుగుతుంది కాని, ఆగ్రహం ఎంతమాత్రం కలుగదు. నిస్సహాయులపట్ల నిర్దాక్షిణ్యంగా ప్రవర్తించే ఏ సమాజమైనా పతనంకాక తప్పదు భారతంలో ద్రౌపది చరిత్ర ద్వారా మనం నేర్చుకునే గుణపాఠం ఇదేనని నా అభిప్రాయం

# తెలంగాణా వచన కవిత్వం

(గత సంచిక తరువాయి)

– సీతారాం

దిగంబర కవుల దృక్పథ అన్వేషణ వచన కవిత్వంలో విప్లవవ దృక్పథంగా 1970ల గ్గానీ ఫలించలేదు చేతనా వర్తానిదీ దృక్పథ అన్వేషణే. ''సమగ్రమైన మానవ వికాసానికి అన్నిరంగాల సమన్వితమైన వికాసం అవసరం. పాక్షిక దృష్టి అభివృద్ధి హేతుకం కాదు ఈ సమన్వితి కోసం ఈ కవులు భావి దర్శనం చేస్తున్నారు'' (సుప్రసన్న - చేతనావర్తం, రజతోత్స వ సంచిక - పుట.127) ఈ అవగాహన వ్యక్తి నిష్ఠమే ఈ నలుగురికీ ఆమోదయోగ్యమైన ఒక దృక్పథంగా చెప్పదగినదేదీ కనిపించదు నలుగురి ఆలోచనల నడుమ ఎన్నో అంతరాలు వర్తమానాన్ని దిగంబరకవి పూర్తిగా కాదన్నాడు చేతనావర్తం ఆపని చేయకుండా భావిని దర్శించాలని అనుకుంది అయితే 'మానవ జీవితంలోని పురోగతి, సుదూరాకాశాల స్ఫురించే దివ్య జీవన శిఖరం అధిరోహించడంగా వీళ్ళుభావిస్తున్నారు' అంటూ విషయాన్ని అమూర్తపరిచి తన దృక్పథాన్ని వెల్లడించింది.

విడిగా ఈ కవుల ఆలోచనలను పరిశీలిస్తే ''సమాజం సమాజంలోని మండుతున్న సమస్యలు ఈనాటి వస్తువు కవి సంఘంలోని ఏ యితర వ్యక్తి కన్నా గొప్పవాడేం కాదు సమస్యల్నించి పారిపోయే కవిని సమాజం క్షమించదు. ఒక విధంగా నేడు కవియైన వానికి సాంఘిక చైతన్యం, రాజకీయ చైతన్యం విధిగా ఉండవలసిన గుణాలు, దేశాన్ని గూర్చి సమాజాన్ని గూర్చిన వాస్తవిక దృష్టి కావల్సిన మరో ప్రధానం గుణం'' అని కె. నరసింహారెడ్డి ప్రకటించాడు. కవిత్వం కూడా చెప్పిన విషయాలకు అతి సమీపంగా ఉంది. '1963' లో కె. నరసింహారెడ్డి ప్రకటించిన 'సమరగీతి' లో గానీ 1964లో పాకిస్థాన్‌తో యుద్ధం వచ్చినప్పుడు ప్రకటించిన 'సమర భారతి' లోనూ, 1971లో బంగ్లాదేశ్‌లో వచ్చిన ప్రజల పోరాటాన్ని సమర్ధిస్తూ వచ్చిన 'సమర్‌పథే బంగ్లా' లో గానీ వీటిని స్పష్టంగా చూడవచ్చు. ఈ మూడూ ఆయన సమీకరించి ప్రచురించినవే అయినా వీటిని ప్రకటించడంలో కవిదృక్పథం అర్ధం చేసుకోవచ్చు అలాగే తెలంగాణాకవుల ప్రతిస్పందనకు ఇతర ప్రాంత కవుల స్పందనలకు తేడా వీటిల్లో చూడవచ్చు ఇక జగన్నాథం ''గతంలోంచి అనుభవాన్ని పిండి, వర్తమాన విషవలయాల్ని ఛేదించి భవిష్యదంచాల వైపు చేతులు చాచి, మనిషిలో నిగూఢంగా ఉన్న మానవతను జాగృతం చేసే ప్రయత్నమే ఈ కవిత'' అన్నారు సాగరసంగీతం నుంచి మానవతా దృక్పథం, సామాజిక ప్రగతి, అభ్యుదయ భావన మొదలైనవి ఆయన విశ్వసిస్తూ వచ్చారు. అయితే కమ్యూనిస్టు రాజకీయాలు, సిద్ధాంతాలు సాహిత్యంలోకి రావడాన్ని ఒప్పుకోలేదు. అయితే రాజకీయాలలోకి అవలక్షణాలుగా వచ్చి చేరిన నాయకుల పదవీ కాంక్షలు, అధికార దుర్వినియోగాలు, బంధుప్రీతి మొదలైన వాటిని 'గ్రేట్ ఇండియన్ సర్కస్' లో తీవ్రంగానే ఖండించారు ఈ ఇద్దరిలో సామాజిక స్పర్శ ఎక్కువ

పోతే, సంపత్కుమార ''దేశ, కాల సమాజాల త్రిపుటి / అన్నిటికీ కేంద్రమైన వ్యక్తి / అనంత వైవిధ్యంగల మనః ప్రవృత్తి / అన్ని దశల్లోనూ మానవ సమగ్ర వికాసం / ఆధునిక భావ చైతన్య విన్యాసం నినాదాడంబరాలు లేని విధానం / ఇజాల విషవలయం చీల్చి వచ్చే నిజం'' తన కవితకు ప్రేరణలుగా భావించారు. ఇజాల మీదవైముఖ్యం, సమగ్రత, నినాదరాహిత్యం, ఆడంబర రాహిత్యం ఈ తరహా జీవన విధానాన్ని ఆయన కాంక్షించారు. అయితే వ్యక్తి కేంద్రంగా భావచైతన్య విన్యాసం ఉండాలని అది వివిధ పరిణామాల్లో మానవ సమగ్ర వికాసాన్ని సాధింపజేసేదిగా ఉండాలని భావించినట్లు చెప్పవచ్చు.

ఇక సుప్రసన్న ''కవి వేదనానుభవం వైయుక్తికం / సహృదయుని అనుభవం సామాజికం / శబ్దానికి నియతమైన అర్థం / కవిత్వానికి అర్థం అనంత ముఖం / వ్యక్తి సమాజంగా, అతని మనస్సు సామాజిక చైతన్యంగా రూపొందుతుంది'' అంటారు సమాజంలో వ్యక్తిని కాకుండా, వ్యక్తిలోనే సమాజాన్ని చూడటం కనిపిస్తుంది భారతీయ సంప్రదాయ బలం, అస్తిత్వవాదభయం, ఇజాల మధ్య వ్యతిరేకత, కవిత్వంలో ఏదో మూలతత్త్వం లోపించిందనే దృష్టితో చేసే అన్వేషణ సుప్రసన్నది ' ఆ మూలతత్వం' గురించిన విశ్లేషణ మరొకసందర్భంలో చర్చించాల్సి ఉంది సుప్రసన్నలో రాజకీయ చైతన్య ప్రస్తావన లేకపోవడం గమనించదగింది ఈ కవుల అభిప్రాయాలు మొదటి సంపుటి కాలం నాటివికావు ఇవి రెండో సంపుటి కాలం నాటివి ఈ అభిప్రాయాలు వ్యక్తం చేసే నాటికి నిరసం ఏర్పడబోతోంది

దిగంబర కవులైన నిఖిలేశ్వర్, జ్వాలాముఖి, చెరబండరాజులలో ఆదర్శ తత్త్వం ఎక్కువ అరాజిక తత్త్వమూ ఉంది అందుకు తగ్గ కాల్పనిక ఆవేశం ఉంది జ్వాలాముఖి మార్క్సిస్టు సిద్ధాంతాన్ని అనుసరించాడు నిఖిలేశ్వర్, చెరబండరాజులలో ఆభావాలున్నాయి జ్వాలాముఖి, నిఖిలేశ్వర్‌లు అప్పటికి వచన పద్యం పొందిన అభివృద్ధిని అంగీకరించి, ఆ తీరులోనే రచన చెయ్యడం పట్ల ఆసక్తి చూపించారు వీరిలో చెరబండరాజు ఒక్కడిలోనే కవిత్వరూపంలో తెచ్చిన విప్లవానికి హేతువులైన లక్షణాలు విస్పష్టంగా కనిపిస్తాయి

పోతే తిరుగబడు కవులు 1969లో ''తిరుగుబాటు తత్త్వం మానవ స్వభావంలో ఉన్నది ఈనాడు మేల్కొంటున్న ఈ దేశంలో అక్కడక్కడా రాజుకుంటున్న ప్రజా పోరాటాలే అందుకు నిదర్శనాలు'' అని గుర్తించారు దీనితోనే ఆగలేదు ''అరణ్యాల్లో, కొండకోనల్లో, చెట్లల్లో, పొదల్లో కార్చిచ్చులా రాజుకుంటున్న ఈ జ్వాలల్ని పెంచడానికి మా తిరుగుబాటు హస్తాలను అందిస్తున్నాం మాతోపాటు ఈ దేశంలో విప్లవం రావాలని నిజాయితీగా భావిస్తున్నాం వెన్నెముక, ముందుచూపు గల యువకులందరినీ అందుకే తిరగబడుదాం రమ్మంటున్నాం'' అంటూ పిలుపునిచ్చారు వరవరరావు, లోచన్, అశోక్‌లు కవిత్వానికి కావలసిన రాజకీయ, ఆర్థిక దృక్పథాలను రెండిటినీ మళ్ళీ ప్రవేశపెట్టారు '' ఎన్నేళ్ళు గడచినా తొలగిపోని ఆర్థిక అసమానతలపట్ల అసంతృప్తులైన ప్రజలలో అలజడి ఆరంభించే తరుణంలో'' దానిని చల్లార్చే వారిపైన తిరగబడమని కవిత్వం రాశారు. '' ఈ నిజాన్ని పీడిత, తాడితులకు తెలిపి గాఢనిద్రనుంచి మేల్కొలిపి చైతన్యవంతులుగా చేయటం ఈరోజు అభ్యుదయవాదుల కర్తవ్యం'' అంటూ వరవరరావు గుర్తు చేశారు అటు దిగంబరులూ, ఇటు చేతనావర్తం దొరకబుచ్చుకోలేక పోయిన 'కర్తవ్యం' తిరగబడు కవులముందు ఉంది తెలంగాణా కవిత్వంతో పాటుగా తెలుగు కవిత్వం 'దారి' వెతుక్కుంటున్న తరుణంలో తిరగబడు కవి 'మనిషి కన్నా ఎక్కువ పెరగకు' అనే హెచ్చరికలాంటిది చేశాడు

'' ఆదర్శ శిఖరాలపై కూర్చుండి
అలౌకికానుభూతితో
ఆకాశానికేసి చూసే మనిషీ
దిగువన దీనులున్నారు
ఆకలి ఉంది. అవమానం ఉంది
అశ్రువులున్నాయి అన్యాయం ఉంది దిగిరా'' అన్నది తిరగబడు కవుల మేల్కొలుపు

దిగంబర కవులు తెచ్చిన కదలిక, తిరగబడు కవులు తీవ్ర ఆర్థిక, రాజకీయ చైతన్యం, నక్సల్బరీ ఉద్యమనేపథ్యం, శ్రీకాకుళ గిరిజన పోరాటం ప్రేరణ, భూస్వామ్య వ్యతిరేక పోరాటల చైతన్యం, దేశంలోకి ప్రవేశించిన అతివాద రాజకీయాలు, మార్క్సిస్టు పార్టీలో చీలిక తదితరాంశాలు తనలో కలుపుకుని 1970 జులై 4న విరసం ఆవిర్భవించింది 1967 భారత కమ్యూనిస్టు ఉద్యమ చరిత్రలో ప్రముఖంగా నిలవడమే కాకుండా భారతీయ భాషలన్నిటిలోకీ ఒక పదం చేర్చినట్లుగా విరసం పుట్టుకతో తెలుగు కవిత్వంలోకి ఉద్యమ స్ఫూర్తి, ఉద్యమ ఆవేశాలు వచ్చిచేరాయి ఆనాటికి శ్రీశ్రీని విరసం హైజాక్ చేసిందనేది అభియోగం అయితే తెలంగాణా కవుల ప్రోద్బలం వల్ల విరసం పుట్టిందికనుక శ్రీశ్రీని విరసం హైజాక్ చేసింది అనేకంటే, తెలంగాణా ప్రాంతమే శ్రీశ్రీని హైజాక్ చేసిందనడం సమంజసం విరసం రాజకీయ దృక్పథాన్ని సాహిత్య దృక్పథంలో భాగం చేసింది

అంతకు ముందు చేతనావర్తం ప్రతిపాదించిన 'సమగ్ర వికాసం' 'సమగ్ర విమోచనం' మొదలైనవి కొత్త అర్థాలతో కవిత్వంలో నిర్వచించబడ్డాయి 'మార్క్సియన్ సోషలిజం' ధ్యేయంగా పెట్టుకున్న కవిత్వాన్ని కవులు రాశారు. అప్పటిదాకా 'ప్రజాస్వామ్య భావాలు' అనే పదానికి బదులుగా 'నూతన ప్రజాస్వామ్యం' అనే మాట వినబడసాగింది అలాగే నూతన ప్రజాతంత్ర విప్లవం, మార్క్సిజం - లెనినిజం - మావో ఆలోచనా విధానాల ఊతంతో ముందుకు సాగడానికి నిచ్చయించింది. ఈ దృక్పథంలో వెలువడిన కవిత్వంలో (1) భూస్వామ్య విధానాల వ్యతిరేకత, (2) పార్లమెంటరీ ప్రజాస్వామ్య వ్యతిరేకత ప్రధానంగా కనిపిస్తాయి విప్లవ కవి వరవరరావు ''పార్లమెంటు పులికూడ / పంజాతో పాలించును / సోషలిజం వల్లించీ ప్రజారక్తం తాగును'' అని అంటే, చెరబండరాజు ''ఈ మట్టినాకు పట్టెడన్నం పెట్టి పాలు తాపింది / రాక్షస భూస్వామ్యపు రంపపు కోతల్నుండి / తనను విముక్తం చేసి ఋణం తీర్చుకుంటాను'' అంటాడు

వీటి తరువాత స్థానం సామ్రాజ్యవాద వ్యతిరేకత, శ్రామిక వర్గ పక్షపాతం అంతర్జాతీయవైఖరి, వివిధ ప్రజాపోరాటల పట్ల అనుకూలత మొదలైన భావాలు వ్యక్తం అయ్యాయి. ''నా దేశపు మట్టిలోంచి/ కష్టజీవుల నిట్టూర్పుల్లోంచి / తిరుగుబాటు ముడిసరుకును / తియ్యడమే పనిగా పెట్టుకుంటున్నా''నని విప్లవకవి ప్రకటించాడు. చెరబండరాజు, వరవరరావు తదితర కవులు ఈ దృష్టికోణం నుంచే సామాజిక, రాజకీయ పరిణామాలకు ప్రతిస్పందిస్తూ రాశారు. వరవరరావు నేటికీ ఈ దృక్పథానికి కట్టుబడి ఉండే కవిత్వ రచన చేస్తున్నారు.

విరసం పుట్టుకకు ముందు వచ్చిన తిరుగుబాటు కవిత్వం ప్రధానంగా నగర జీవితానికి సంబంధించింది కావడం గమన్హార్హం. విరసం ఏర్పడ్డాక ''.... విప్లవ కవిత్వం క్రమేణా రెండు లక్షణాలను సంతరించుకుంది. మొదటిది కవితా వస్తువు విప్లవానికే పరిమితమయిపోవడం మరీ ముఖ్యంగా అది రాను రాను అమర వీరులకే పరిమితమయింది. రెండోది విప్లవోద్యమ ప్రభావం వల్ల కొంత ఇతరత్రాను విప్లవ కవిత్వం నగరేతర (Non-urban) స్వభావాన్ని సంతరించుకుంది'' (సి.వి సుబ్బారావు - సంద్దిగ్ద సందర్భం - పుట. 122)

'అమరత్వాన్ని' అక్షరాల్లో కళ్ళకు అద్దుకోనూవచ్చు
అహంభావంతో సానుభూతీ చూపొచ్చు కానీ వీరుని మరణం
చరిత్ర కాలంపైచేసిన మార్పు సంతకం' (వరవరరావు, భవిష్యత్ చిత్రపటం - పుట: 51)

దీనినిబట్టి చూస్తే సుబ్బారావు పరిశీలన తెలంగాణా వచన కవులకు సరిగ్గా సరిపోతుంది ఎందుకంటే ఈ పరిమితుల్ని కవులు విధిగా పాటించారు నిబద్ధత పేరిట అదే పక్కీలో కవిత్వం రాశారు నేటికీ అడపాదడపా కవిత్వంలో 'అమరవీరుల' నీడ ఎజెండాను మనం చూస్తున్నాం ఉత్తర తెలంగాణాకు సంబంధించి ప్రజాస్వామ్యబద్ధం కాని అక్రమ నిర్బంధాలు, ఎన్‌కౌంటర్లు, రాజ్యహింస, మిస్సింగ్‌లు ఇవి కవిత్వ వస్తువులయ్యాయి అమర వీరుల్లో తెలంగాణా ప్రాంతం వారే ఎక్కువగా ఉండటం విస్మరించరానిది పైన చెప్పిన రెండు లక్షణాలు కవిత్వంలో విప్లవత్వానికి నిర్వచనంగా మారటంమొదలుపెట్టాక విరసం కవుల కవిత్వం క్రమంగా ప్రాధాన్యాన్ని కోల్పోయింది ముఖ్యంగా తెలంగాణా ప్రాంతంలో జరుగుతున్న సంఘటనలు, వాటి పర్యవసానాలు ఒకేలా ఉండటం మొదలైంది దీనిని 'విరసం పై- తెలుగు సాహిత్య ప్రభావం' అనే వ్యాసంలో సి వి సుబ్బారావు వివరించారు '' సంకుచితంగా నిర్వచించబడిన విప్లవ కవిత్వంలో వస్తు రీత్యా, వ్యక్తీకరణ రీత్యా, వైవిధ్యానికీ, విస్తృతికీ చోటు లేకుండా పోయింది ఈ పరిధి బయట జీవితాన్ని సమాజాన్ని ప్రతిఫలించగల కొత్తవాళ్ళు విరసం బయటే మిగిలిపోయారు '' (సి వి సుబ్బారావు, సందిగ్ధ సందర్భం - పుట 122) ఏ తెలంగాణా ప్రాంత కవుల చేతుల్లో విరసం రూపుదిద్దుకుందో, ఆ కవుల చేతుల్లోనే విరసం 1980ల నాటికి బలహీనపడింది

1980ల నాటికి తెలంగాణా సమాజంలో పోరాటాలున్నాయి, లేదా పోరాటానికి సమాయత్తం అవుతూ ఉంది సామాజిక ఉద్యమం బలహీనంగా ఉందనిగానీ, బలంగా ఉందనిగానీ చెప్పలేని స్థితి అది ఈ స్థితిలో 1970ల నాటికి కొత్తగా కవిత్వం రాయటం మొదలు పట్టిన కవుల్ని విరసం ఎంత బలంగానో ఆకర్షించింది 1980ల నాటికి ఈ పరిస్థితి తారుమారైంది కొత్తతరంలో స్వల్ప సంఖ్యలోనే కవులు విరసం పట్ల ఆకర్షితులయ్యారు 1980-89ల మధ్య ఉత్తర తెలంగాణాలో జరిగే అనేక సంఘటనలు కవితా వస్తువులయ్యాయి సిరిసిల్ల, జగిత్యాలపల్లె, ఇంద్రవెల్లి వీటి ప్రభావాల్లోంచి పుట్టిన కవులు కూడా కనిపిస్తారు. మొత్తంమీద విరసం తెలంగాణాలో తన ప్రాబల్యాన్ని అంతగా చూపలేక పోవటం 1980ల తర్వాత - (అల్లం నారాయణ - జగిత్యాలపల్లె)

కవిత్వంలోకి కొత్త తరం వచ్చిన ప్రతి సందర్భంలోనూ వస్తు దృక్పధాలు మారతాయి ఈ అన్నిటికంటే ముందుగా రూపం మార్పును కోరుతుంది. రూపం మార్పు విషయంలో కొత్త తరం కవులపై ఒక వత్తిడి ఉంటుంది. పూర్వతరం కవుల బలమైన ప్రభావముంటే అదే పద్ధతిలో వస్తురూప, దృక్పధాలు కొనసాగుతాయి ఈ ప్రభావాలు లేనప్పుడు వస్తువు, దృక్పధం, రూపం మారుతుంది. ఇది తెలంగాణా వచన కవుల విషయంలో స్పష్టంగా కనిపిస్తుంది ఒక తరం తన వెంట తెచ్చుకునే మార్పులను బట్టే కవిత్వంలోకి వచ్చిన తరం కొత్తదో కాదో గుర్తించటముంటుంది

1980ల తర్వాత వచ్చిన తరం చెప్పుకోదగ్గ రీతిలో కవిత్వంలో మార్పులను తెచ్చింది లేదంటే మార్పులకోసం ప్రయత్నం చేసింది. ఒక్క ముక్కలో చెపితే 1980ల తర్వాత వచన కవిత్వంలో అభివ్యక్తిపైన శ్రద్ధ ఎక్కువైంది 1970లలో ఈ తరహా వక్యీకరణ దృష్టి కనిపించదు వ్యక్తీకరణలో మార్పును కోరుతున్న తరం ఒకటి ముమ్మందు రానున్నప్పుడు పూర్వ పద్ధతిలోనే వ్యక్తీకరణకు అలవాటు పడి ఉన్న కవులలోనూ ఒక విచికిత్స మొదలవుతుంది. గుడిహాళం, సుంకిరెడ్డి, ఆసుర తదితర కవులు 1970 - 80ల మధ్య ఉద్యమ కవిత్వానికి, ఉద్యమం పట్టించుకొని ప్రయోగపర లక్షణమున్న కవిత్వానికి ఒక సమన్వయం సాధించేందుకు పూనుకున్నారు 1981 లో గుడిహాళం రఘునాథం రాసిన కవితను

ఇక్కడ ఉదహరించవచ్చు 'పద్యంలో ఇమడాల్సిన అందం' - దాన్లో కవితకు కావలసిన / రావలసిన రూపం గురించి ప్రస్తావన ఉంది అయితే ఆ రూపమే వస్తు దృక్పథాలను మరుగు పరుస్తుందేమోనన్న శంక కూడా ఉంది వచన కవిత విప్లవం అనే వస్తువునుంచి దూరంగా జరిగే క్రమం ఒకటి మొదలై అందుకు తగ్గ కవిత్వం వస్తున్నట్లు ఈ కవిత తెలియ జెపుతుంది

''అందం నన్ను మోసం చేస్తుంది
నాకు తెలీకుండానే నా పద్యం వెనక దాక్కుంటుంది
నన్ను నా ప్రజల్లోంచి దూరం చేస్తుంది
నేను సంఘంలోని బీభత్సాన్ని చెప్పేప్పుడు
నా గొంతును దారి మళ్ళించి
సౌకుమార్యంలోకి దింపుతుంది
ఆచార దుర్వాసనల్ని ప్రస్తావించేప్పుడు
పద సౌరభాల్లోకి నన్ను పడదోస్తుంది.
నేను ఎడారుల్ని గురించి చెబుతుంటే / అలంకరించటానికి
మల్లె తీగల్లాంటి పద చిత్రాల్ని నాకందిస్తుంది
తొంగి చూస్తున్నదొక్కసారిగా
మీకూ నాకూ మధ్య తెరై వాల్తుంది
అప్పుడు నేను బహుశా
సాంఘిక హత్యల్ని గురించి మాట్లాడుతుంటాను
చట్టబద్ధ హింసాకాండల్ని గురించి ఆలోచిస్తుంటాను ''
(గుడిహాళం రఘునాథం - ఫోర్‌పర్సన్ సింగ్యులర్ - పుట 9)

1960లో కవిత అందంగా ఉంటేట్టు. అందరికీ అందేట్టు చెపితే, ఈ రెండు దశాబ్దాల కవిత్వంలో వచ్చిన మార్పు అందంగా ఉంటూ, అందకుండా చెప్పేధోరణి ఎక్కువైందనే విషయాన్ని ఈ కవిత నిరూపిస్తుంది. వస్తు దృక్పథాల స్థానాన్ని రూపం ఆక్రమించిన విషయాన్ని ఈ కవిత విమర్శకు పెట్టింది 80ల తర్వాత రావటం మొదలైన కవిత్వ విషయంలో 'అస్పష్టత' వచ్చిందనే విమర్శకూడా ఇక్కడ నుంచే మొదలైంది.

1970ల తరానికి దృక్పథం విషయమై నేపథ్యాన్ని సమకూర్చింది శ్రీకాకుళ గిరిజన పోరాటం తెలంగాణాకున్న ప్రత్యేక సమస్యల్ని జీవితాన్ని వదిలిపెట్టి ఒక విస్తృత ప్రాతిపదిక మీద రాజ్యంతో తలపడే కవిత్వాన్ని రాసింది. 1970ల తరం రాసిన దాన్లో తెలంగాణా అనుభవం మొత్తం సామాజిక అనుభవంలో భాగం. ఈ అనుభవం ఆనాటి పరిస్థితుల దృష్ట్యా వర్గ దృక్పథంగా చూడబడింది. 1970ల తరం మొత్తం సమాజాన్ని సామాజిక, రాజకీయ, ఆర్థికాంశాలను వస్తువుగా గ్రహించింది ఆ మొత్తంలోంచే ఇక్కడ జీవితాన్ని చూసింది. 1980ల తరం తన అనుభవం ప్రాతిపదికగా మొత్తం సమాజాన్ని చూడ్డం మొదలు పెట్టింది. 1970ల కవికి రాజకీయ దృక్పథం ప్రధానం ఈ దృష్టి కోణంనుంచే జీవితానుభవ విశ్లేషణ. కానీ 1980ల కవిత్వానికి కవి తన అనుభవాన్నే ప్రధానీకరించుకున్నాడు. తన అనుభవం ప్రధానం - తరువాత సామాజిక అనుభవం ఈ రెంటి ద్వారా

కలిగిన చైతన్యం దాన్ని అనుసరించి వచ్చే రాజకీయ దృక్పథం ఇవి ఈ క్రమంలో ప్రాధాన్యాన్ని పొందాయి ఈ తేడా ఉన్నందువల్లనే 1970ల నాటి కవిత్వం సూటిదనం ఎక్కువ స్పష్టంగా అర్థమవుతుంది కూడా అయితే వైవిధ్యం తక్కువ 1980ల నాటికి వ్యక్తిగా కవి అనుభవం మొదట వ్యక్తంకావాలి ఆ పైనే ఏ దృక్పథమైనా మరొకటైనా బయటపడేది 1970ల కవిత్వంలో తీవ్రత, ఆవేశం అధికం 1980ల కవిత్వంలో ఎప్పుడో తప్ప ఆవేశం కనిపించదు నిరసన ఉంది, అసంతృప్తి ఉంది, ఆర్ద్రత పెరిగింది సామాజిక అనుభవం నుంచి వచ్చిన దాన్లోకన్నా ఇందులో సూటిదనం లోపించటం కనిపిస్తుంది దానిక్కారణం తెలంగాణా కవి చెప్పిన మాటల్ని బట్టి అర్థం చేసుకోవచ్చు. ఎనుబై దశకంలో ''నా చుట్టూ ఉవ్వెత్తున్న ఉరుమురిమి పడుతున్న జన సముద్రాలు, ఒక్కచోటా నిలబడనీయని రాజ్య హింస - హత్యలూ - ఆత్మహత్యలు, దిన దినం గ్రామాలకూ పట్టణాలకు మధ్య పెరుగుతున్న దూరాలు. ముసుగులో గుద్దులాట, శిధిలమవుతున్న వ్యవస్థా బీభత్సం'' (జూకంటి - పాతాళ గరిగె) ఇదొకవైపున ఉంది మరోవైపున ''మొండివారుతున్న తనం, కొల్లగొడుతున్న మనిషి సార్వభౌమాధికారం - కుంచించుకు పోతున్న వైశాల్యాలు, విడదీస్తున్న వైరుధ్యాలు, ఆకర్షిస్తున్న ధృవాలు అడుగడుక్కీ అనివార్యంగా ప్రయోజత మవుతున్న బతుకు తండ్లాట. నన్ను 'బెంగటీల' చేశాయి మనసును 'కలికలి' చేశాయి - కోల్పోయిన అంశాల్ని తిరిగిపొందే 'పాతాళగరిగె' నన్ను నిరంతరం అరమరికలు లేకుండా నిలబెట్టింది'' (జూకంటి జగన్నాధం - పాతాళగరిగె) ఇదొక కవి తన కవితా సంపుటికి రాసుకున్న పరిచయంలోని స్వవిషయమే అయినా తెలంగాణా ప్రాంతానికి చెందిన ఏ కవి జీవితంలోనైనా అనుభవంలోకి వచ్చిన అంశమే 1970ల కవికి ఒంటరిగా బెంగటిల్లడం లేదు. మనసు 'కలికలి' కావడం లేదు ఉన్నదల్లా పోరాట స్ఫూర్తి, ఉద్యమ ఉత్తేజం - రాజకీయ దృక్పథం పొందబోయే దాని గురించిన ఆశావహ దృష్టే తప్ప పోగొట్టుకుంటున్న దాని గురించిన విచారం లేదు కోల్పోయిన వాటిని తిరిగి పొందే 'పాతాళగరిగె' అవసరం అయ్యిందంటే కవి వైయక్తిక జీవితానుభవం గురించి ఆలోచిస్తున్నాడని, వెతుకుతున్నాడని అర్థం, 'విడదీసే వైరుధ్యాలు' 'ఆకర్షించే ధృవాలు' మనిషి మొండిబారిపోవటం ఇవన్నీ ఆలోచింపజేశాయి ఇవి రాన్రానూ మరింత జటిలం అయ్యాయి 1990ల కనిపించే బాల్యం, ఊరు, మొదలైన వాటిని గూర్చిన 'నొస్టాల్జియా' కు మూలం ఇక్కడనుంచే మొదలవుతుంది. బాల్యంతో మొదలుపెట్టి నగర జీవితంలోని ఒంటరితనం దాకా కవితావస్తువే అయ్యింది. 80ల మధ్య కాలానికి, 80ల చివరి కాలానికి సాగిన 'విపశ్యన' కవుల కవిత్వ బులెటిన్‌లలోనూ ఇటువంటి ఆలోచన కనిపిస్తుంది అయితే విపశ్యన కవులు కవిత్వానికి దూరమైపోయిన రాజకీయ దృక్పథాన్ని తిరిగి కవిత్వంలోకి తెచ్చే ప్రయత్నం ఒక వైపు చూస్తూనే ఉన్నారు. వర్తమాన రాజకీయ, సమాజకార్థిక, సాహిత్య పరిణామాల మీద దృష్టి నిలిపిన కవిత్వం 'విపశ్య'నులది ఇది మండల్ - మందిర్ రాజకీయాలనుంచి దీనిని వదిలిపెట్టకుండా కవిత్వంలో చర్చించింది. విపశ్యన కవితాసంచికలు కలిగించిన చైతన్య ప్రభావం కొంత దళిత కవిత్వం మీద పడిందంటే అతిశయోక్తికాదు.

ఇక 1990లకు వచ్చేప్పటికి కవి మరింత వైయక్తిక అనుభవాల వ్యక్తీకరణకు దిగాడు. ఇందులో Rural Urban Conflict అధికంగా కనిపిస్తుంది. అస్తిత్వ వాద కవిత్వ ఛాయలో ఉన్న వ్యక్తీకరణ ఉంది. నిరాశ, నిస్పృహ, సాదికారిక అస్తిత్వాన్ని కోల్పోయిన - కోల్పోతున్న తీరు, మృత్యుభావనలు ఇవన్నీ రూపం తీసుకున్నాయి ఈ అన్నిటికీ తెలంగాణా కవులు అభివ్యక్తిని ఇచ్చారు. 1990 నాటికి

కవిత్వం మరింత చిక్కబడింది. కవి వ్యక్తిగత అనుభవాలలోంచే సామాజిక పార్శ్వాన్ని చూపడం మొదలైంది. ఈ తరహా కవిత్వానికి పరాకాష్ఠరూపమే సిద్ధార్థ 'దీపశిల' సిద్ధార్థలాంటి కవులు హైదరాబాద్ నగర జీవితాన్ని, ఆ అనుభవాన్ని, దానివల్ల కలిగిన ఘర్షణను చిత్రించడం మొదలైంది కవిత్వం మూర్తతనుంచి అమూర్తతకు చేరుకుంది సంక్లిష్ట నగర సంస్కృతి మధ్య నిలబడి తన గ్రామీణ మూలాలను వెతుక్కోవడం తెలంగాణా కవికి ఎదురయ్యే అనుభవం కవి వర్తమాన అనుభవం, గతానుభావంతో సంఘర్షించాల్సి వచ్చిందో అక్కడ నివారించలేనంతగా కవిత్వం నైరాశ్య భావ ప్రకటనగా మారింది

1990ల వచన కవిత్వంలో తెలంగాణా ప్రాంత కవులలో కనిపించే ప్రధాన లక్షణాలు - గ్రామీణ పట్టణ అనుభవాల మధ్య ఘర్షణ, తత్ఫలితంగా వ్యక్తమయ్యే కవి ఆందోళణ - ఒంటరితనం ''అనుభవాల సంఘర్షణల గుట్టు విప్పడమే కవిత్వం''గా నిర్వచించిన కవి అనుభవానికి ప్రథమ స్థానం, ఘర్షణకు ద్వితీయ స్థానం ఇచ్చాడు ఒక రాజకీయ దృక్పధానికీ కట్టుబడకుండానే తన ప్రాపంచిక దృక్పథాన్ని ప్రదర్శించటం వివిధ సామాజిక సంఘటనలకు ఒక దృక్పధమంటూ లేకుండా స్పందించటం రెండో పాయ తెలంగాణా బీభత్సాన్ని ఒడుపుగా కవిత్వీకరించటం తెలంగాణా ఊరు ఒక సామాజిక యధార్థాన్ని Metaphor గా మార్చి చెప్పడం, వర్తమాన రాజకీయవైఖరులను, సామాజిక పరిస్థితులను వాటి మౌలిక కారణాలను వెతికే ప్రయత్నం కనిపిస్తుంది

1990ల తర్వాత తెలంగాణా ప్రాంత కవులనుంచి వైవిధ్యంతో కూడిన కవిత్వం వచ్చింది. ఇది 1985 నుంచే మొదలైంది అదేవిధంగా తెలంగాణా మాండలికంలో కవిత్వం రాయడానికి ఇంకా వెనకాముందాడటమే కనిపిస్తుంది. 'గుడిసెగుండె' (1973) దేవరాజు మహారాజు, 'గాయపడ్డ ఉదయం' లాంటి సంపుటాలలో ఈ సంశయాన్ని ఛేదించే ప్రయత్నం చేశాయి భానుమూర్తి ' ఊరోల్లు' కృష్ణమూర్తి యాదవ్ 'తొక్కుడు బండ' కవితా సంపుటాలున్నాయి నిజానికి తెలంగాణా వచనకవులు నిత్యజీవితంలో మాట్లాడే భాష ఒకటి, కవిత్వం కోసం ఉపయోగించే భాష మరొకటిగా ఉంది. "In every classridden society the speech behaviour of the upper class differs strikingly from the speech behaviour of the lower classes" అని ఆధునిక భాషా శాస్త్రవేత్తల పరిశోధనలు తెలుపుతున్నాయి. పై వర్గాల భాషణం భావ వినిమయ వ్యవస్థలో సమర్థం సువ్యవస్థితం, వ్యాకరణ బద్ధం, అందుకు భిన్నంగా క్రిందివర్గాల భాషణం శాబ్దిక ప్రణాళికలోగానీ ఆలోచనలను, భావాలను వ్యవస్థీకరించటంలో లోపభూయిష్టంగా ఉంటుంది. ఇది వర్గాలకే కాదు ప్రాంతాలకు కూడా వర్తిస్తుంది. భాషని సాంస్కృతిక అంశంగా, ప్రత్యేకతగా అంగీకరించే దృష్టి అలవడని వాస్తవంలో మాండలికాలపట్ల చిన్నచూపును ప్రదర్శించటం ఉంటుంది చూస్తున్న - చూడబడుతున్న వారిలో ఒకరిలో ఆధిక్యత, రెండో వారిలో న్యూనతలు సహజం, తెలంగాణా కవులు నిత్యవ్యవహారంలో ఉపయోగించే భాషనే కవిత్వ భాషగా ఉపయోగించడంలో చొరవచూపక పోవడానికి ఈ న్యూన, ఆధిక్య భావాలు అడ్డొచ్చాయి. కవులకు తెలంగాణా సాంస్కృతిక అస్తిత్వాన్ని పట్టి యిచ్చే భాషను కవిత్వానికి విస్తృతంగా ఉపయోగించాల్సిన చోట తద్విరుద్ధంగా జరిగింది పదీనిని తెలంగాణా కవిత్వం అధిగమించాల్సే ఉంది. అయితే 1990ల తర్వాత విరివిగా మాండలిక భాష వచన కవిత్వంలో ప్రయోగింప బడుతున్నది.

(సశేషం)

సజీవ మానవతాజలాలతో చిత్రకళాక్షేత్రాన్ని సుసంపన్నం చేసిన మహాకవులు

# రవీంద్రుడు - పుష్కిన్

- శివలింగం

అలెగ్జాండర్‌పుష్కిన్ సోవియట్ రష్యా జాతీయ కవి, చిత్రకారుడు కవుల్లో చిత్రకారులు, చిత్రకారుల్లో కవులు చాలా అరుదు చిత్రకళ దృశ్యకళ కవిత్వం శబ్దకళ మాటలకందని భావాలు చిత్రకళ చిత్రిస్తుంది ఠాగూర్ ఒకసారి నికోలస్ రోరిక్‌తో అన్నాడు - ఠాగూర్ కవిత్వంలో ఎక్కడ విఫలమైనాడో అక్కడ రోరిక్ చిత్రకళ ద్వారా సఫలీకృతుడుకాగలిగాడు పుష్కిన్ (1799-1837), రవీంద్రులు - ఇద్దరూ మహాకవులు, చిత్రకారులు పుష్కిన్‌ను కవిగా రష్యాదేశ ప్రజలు గుర్తించారు కాని ప్రపంచానికి గాని ప్రజలకు గాని చిత్రకారుడుగా తెలియదు ఏకొద్ది మందికో తప్ప పుష్కిన్ కవితానువాదాలు చాలా సాదాగా చప్పగా వుండటం కూడా ఇందుకు కారణం మూలంలోని గీతిమాధుర్యంగాని, నిసర్గసౌందర్యంగాని, అపురూపమైన భావుకతగాని, పదలాలిత్యం సౌకుమార్యం అనువాదాల్లో కనిపించవు పుష్కిన్ ఇంటా బయటా చాలాకాలం వెలుగులోకి రాలేదు శృంగారసాహిత్యం జారిస్టు రష్యాలో నిషేధించడం జరిగింది డచ్ సాహిత్య పత్రికలో 'బర్కోన్స్‌ఘోస్టు' మొదటి సారి ప్రచురణ పొందింది మాస్కోలోని లెనిన్ లైబ్రరీలో పుష్కిన్ రచనలు, చిత్రాలు దుర్భేద్యంగా భద్రపరచబడివున్నాయంటున్నారు పుష్కిన్ - రవీంద్రలు ఆధునిక సాహిత్య నిర్మాతలు కాలాతీత కవులు దేశీయులుగా వుంటూనే విశ్వకవులు కాగలిగారు అసమాన ప్రతిభావంతులు ప్రకృతి సౌందర్యాం, గ్రామీణులు, శ్రామికులు, పల్లెవాళ్లతో పరిచయాలు, చిన్ననాటి నుంచి కిటికీ తెరచి వుంచి ఉదయ సంధ్యల్ని, నదిలోని పడవల్ని చూస్తుండే వాడు రవీంద్రుడు విశ్వజనీనత గ్రామీణ వాతావరణంతో ముడిపడి వుంది పుష్కిన్ తేలియాడే మబ్బుల మధ్య దోబూచులాడే చందమామ, ఉదయాస్తమయాలు, పచ్చని ప్రకృతిని కిటికీ తెరచి చూస్తుండేవాడు

మానవ నాగరికత సమన్వయ లక్షణాలు ఇద్దరిలో గోచరిస్తాయి ఇద్దరిలోవున్న ఆధ్యాత్మిక చేతనా సౌకుమార్యంవల్ల మానవాళిమీద అంతటి ఆత్మీయతను, అభిమానాన్ని, దయను, ప్రేమను చూపగలిగారు ప్రజల దైనందిన జీవనం, భావోద్రేకాలు వారి సాహిత్యంలో పరిపూర్ణంగా దర్శనమిస్తాయి మానవాళికి వారిచ్చిన వారసత్వ సంపద అమూల్యం.

రవీంద్రుడు డెబ్బదవయేట సృజనాత్మక కళాభివ్యక్తికి కొత్తమార్గంగా చిత్రకళను ఎన్నుకున్నాడు చిత్రకళ అభ్యసించలేదు. చిత్రకళా సరస్వతి ఒడి బడిలో ఓనమాలుదిద్ది స్వీయరచనలనుండి కొన్నిటికి చిత్రరూపమిచ్చాడు ఇదొక చిత్రమా అని తనకే సందేహం కలిగేది పెన్నుతోనే స్కెచ్‌లు గీశాడు

పుష్కిన్ చిత్రాలు వృత్తి పరమైనవి కావు పురుషునిగా, స్త్రీగా, యువకునిగా, వృద్ధునిగా, తండ్రిగా, తాతగా ఊహాచిత్రాలు గీశాడు. కవిత్వాన్ని చిత్రాల్లోకి అనువదించాడు కళను జయించింది కవిత్వం అందుకే కవిగానే లోక ప్రసిద్ధి గాంచాడు

కళలో ప్రకృతిలోలేని అందం విభిన్న రంగుల్లో కనిపిస్తుంది చిత్రకళలో ఇద్దరూ పూర్తి నిమగ్నులు కాకపోయినా కవిత్వం కన్నా ఎక్కువ గుర్తింపు ఆదరణ కొన్ని చిత్రాలకు లభించింది

నాకు జీవించాలని కోరిక వుంది. నేనేమిటో తెలుసుకుందామనే కాదు నా గతజీవితం, కోట్లాదిప్రజలజీవితాలు, మానవాళి గతవర్తమాన చరిత్ర తెలుసుకోడానికి జీవించాను పరను స్వీయగా

మార్చాలని వాంఛించాను అన్నాడు పుష్కిన్ చిత్రాలు కథల్లోని పాత్రలే మానవ ముఖాలు, కదలిక లేని ఆత్మీయమైన కళ్ళతో కనిపించే కన్య, సగ్నవనిత, తల్లి, పిల్లవాడు వంటి చిత్రాల్లో దృశ్య నిర్మాణ దక్షత రాగూర్ చిత్రాల్లో కనిపిస్తుంది 1932లో హుగ్లీనది ఒడ్డున యింటిలో ఒకనెలరోజులుండి పద్యాలూ, కొన్ని చిత్రాలూ చిత్రించాడు అమెరికా, డెన్మార్క్, జర్మనీ మొదలైన దేశాల్లో రాగూర్ చిత్రకళా ప్రదర్శనలు జరిగాయి 1920 మే 2 వ తేదీన అర్జెంటీనా కవయిత్రి విక్టోరియా ఒకాంపా పారిస్‌లోని గ్యాలరీలో 125 రాగూర్ చిత్రాల ప్రదర్శన నిర్వహించింది

1930 సెప్టెంబరు 17న స్టేట్ మ్యూజియంలో చిత్రకళా ప్రదర్శన ప్రారంభించాడు పెట్రోవ్, కళాత్మక చిత్రాలు జీవిత మహత్తం అభివ్యక్తీకరణగా శ్లాఘించారు విమర్శకులు. అతని సమకాలికులు పుష్కిన్‌ను ఆంగ్ల కవి విలియం బ్లేక్‌తో పోల్చారు. ఊహలో వస్తు సౌందర్యం బౌద్ధికశక్తి వల్ల స్కెచ్‌లు సజీవంగా వుంటాయి పుష్కిన్ భావుకత మానవుని సర్వోన్నత మేధాశక్తి పుష్కిన్‌తన ఆనందంకోసం చిత్రించాడు. వ్యక్తి ఆత్మవిశ్వాత్మతో విలీనంగావడం నుంచి సృజనాత్మకతలో ఆధ్యాత్మికవైయక్తికత, అభిరుచులు, చుట్టూచూపు కలిసి హాస్యం భావశబలతతో నిశితంగా సహజంగా వెలువడినాయి. పుష్కిన్ చిత్రాలు దిగంతాల అంచుల్ని కలుపుతాయి. చిత్రాలు కవి దృశ్య భావాత్మక శక్తి సామర్థ్యాన్ని వెలికిదీసి చూపుతాయి

1999 జూన్6వ తేదీనాటికి 200 సంవత్సరాలు పూర్తి అవుతున్న సందర్భంగా ప్రపంచం ద్విశతాబ్ది ఉత్సవాలు జరుపుకోబోతుంది. పుష్కిన్ అభిమానులు వారి చిత్రాలన్నిటిని సేకరించి పుస్తకరూపంలో తెచ్చి, వ్యాఖానం కూడా వెలువరిస్తే పుష్కిన్ ప్రతిభను మరింత వెలుగులోకి తెచ్చినవారవుతారు. పుష్కిన్ కవిత్వం, వచన రచనలు రెండు వాల్యములు ప్రచురించారు పుష్కిన్ డ్రాయింగ్సు కొన్ని వేశారు. చిత్రకారుడుగా అతని ప్రతిభను గురించిరాసింది తక్కువే. కళాకారులగురించి కాన్‌స్టాంటిన్ పౌస్టవిస్కీ రాసిన గ్రంథంలో పుష్కిన్ గురించి అక్కడక్కడా ప్రస్తావించాడేగాని ప్రత్యేకంగా రాయలేదు.

## రవీంద్రుడు - అర్జెంటీనా కవయిత్రి విక్టోరియా ఒకాంపా

అర్జెంటీనా దేశపు గొప్ప కవయిత్రి ఒకాంపా భారతీయ తాత్విక చింతనను కవిత్వాన్ని దేశభక్తులకు పరిచయం చేసింది రవీంద్రునికి ఒకాంపా సన్నిహితురాలు. బ్రిటీషువారికి వ్యతిరేకంగా సాగిన భారత స్వాతంత్ర్యోద్యమ పోరాటాలను తనదేశ ప్రజలకు ప్రబోధించి ఉత్తేజితుల్ని చేసింది ఫ్రెంచి భాషలోకి గీతాంజలిని ఆండ్రీజీడ్ అనువదించాడు. 1914లో గీతాంజలి ద్వారా రవీంద్రుడు పరిచయమైనాడు ఒకాంపా మీద గీతాంజలి ప్రభావం గాఢంగా వుంది. రవీంద్రుని ఆదర్శం Where the mind is without fear and head is held high గీతం. మంచి వాళ్ళతోను చెడ్డవాళ్ళతోను రవీంద్రుని భగవంతుడు మాట్లాడతాడు. గీతాంజలి చదివిన ఒకాంపా ఆనందపరవశురాలయింది. తరవాత పదేళ్ళకుగాని కలుసుకోలేదు. ఈలోగా ఆమె కీర్తి సౌధాన్ని వ్యాసాలతో నిర్మించుకుంది. సెప్టెంబరు 1924లో ఠాగూర్‌ను అర్జెంటీనాకు ఆహ్వానించింది పెరూదర్శించడానికి వేళ్ళేప్పుడు బ్యూనో ఎయిర్సులో రవీంద్రుడు రోగగ్రస్తుడయాడు, అక్కడ ఒక యిల్లు తీసుకుని కోలుకునేవరకు ఆమె సేవ చేసింది.... ఇలారాసింది. 'సాన్ ఇసిద్రోలో వసంతం, వెచ్చదనం, అసాధరణమైన గులాబీలు, ఉదయాలు గదిలో గడపడం, అన్ని కిటికీలు తెరచి గులాబీల సువాసనలు ఆఘ్రాణించడం ఠాగూర్‌ను

చదవడం, ఆలోచించడం, రాయడం, నిరీక్షించడం ' నడిచివెళ్లేదారిలో ఒక జంతువు అస్థిపంజరాన్ని చూచి ఒక గీతం రాశాడు రవీంద్రుడు ఒకాంపో కోరిక మీద ఆంగ్లీకరించాడు, ఆవిడకోసం రెండు గీతాలు రాశాడు 1 Faint Heart 2 Last Spring. ఒకాంపోమీద ప్రేమతో అర్జెంటీనా ఒదిలివెళ్లేప్పుడు రాశాడు ఒకాంపోకు అంకితం యిచ్చిన 'పూర్వి'లో చోటు చేసుకున్నాయి వెళ్లేముందురాసిన గీతం

నా నావను రుణ భారంతో నింపుటకు ప్రయత్నించకు
రిక్త హస్తాలతో వెళ్ళిపోడానికి సెలవుయివ్వు
లేకపోతే అమితంగా చెల్లించిన నీ ప్రేమ విలువ ముందు
నా ఎద పేదతనం వెల్లడవుతుంది

సుదీర్ఘ ఓడప్రయాణంలో సుఖంగా వుండటం కోసం ఒక కుర్చీయిచ్చింది ఒకాంపో రాగూరుకు నచ్చిన కుర్చీ మీద ఒక గీతం 'కాళీ కుర్చీలు' కొన్నేళ్ళ తర్వాత రాగూర్ చిత్రకళా ప్రదర్శన పారిస్‌లో నిర్వహించింది రాగూరు మరణం వరకు ఆమె పరిచయం కొనసాగింది 1979లో మరణించింది SUR అనే పత్రికను నడిపి అర్జెంటీనాకు ప్రపంచ సాహితీ వేత్తలకు మధ్య వారధిగా నిలిచింది 1953 వరకు పత్రిక సారధ్యం రాగూరు మరణ వార్తవిని తన పరిచయాన్ని The Path of Soul గా అభివర్ణించింది.

రవీంద్రుడు తన దేశంలోనే మరణించాడు హేమంత ధూమ్రవర్ణాకాశం మైదానాల మీదపరుచుకుంది విశాలమైదానాలమధ్య నిర్మానుష్యరహదారిలో రాగూరు మరణ వార్త వినడం సరియైన స్థానం ఈ సమయంలో నా పక్కన వుంటే మౌనంగా వుండేవాడు ఆయన సలుకు ఆయన మౌనం రెండు నాకు తెలుసు. భారతదేశాన్ని Spiritual Mother Land అంది గురుదేవుని మీద అభిమానం, గౌరవం స్నేహం వుండటమే భారతదేశంతో వున్న బంధానికి మూలకారణం

Continued Page No. 1

Mr. Prusiner declined to comment on the ban, noting only that the research indicating the possibility of human infection may have been released too early.

"The most charitable view that can be adopted ....", say Dr. Koch, "is that the Karolinska committee have disdained to properly evaluate the scientific aspects of (Prusiner's) claims with due attention and the expected responsibility to inform themselves throughly."

"This is the result of an upsurge of scientific 'lobby-activity' and other interests that are directed to increase chances for recognition that *in turn*, help *sponsors* and *media* to discredit competitiors,' declares Dr. Koch, "they lauch organised campaigns to promote a 'friend' for the Noble prize. They cultivate Swedish scientists and correspondents abroad with a view to influence the Nobel committee (at Karolinska), to their profit."

Continue Page No 27

# టీవీతో మనమా? మనతో టీవీయా?

- నాగసూరి వేణుగోపాల్

ఒక దేశాధినేతను ఆదేశపు సైన్యాధికారి లొంగదీసుకుంటే మొదట హస్తగతం చేసుకొనేది టీవీస్టేషనే! ఇది ప్రస్తుత పోకడ, నాయకుల అవసరం. నేడు సమాచారం అనేది ఓ బలమైన ఆయుధం అని - నాలెడ్జి ఈజ్ పవర్ అన్నట్టు - ఒప్పుకోక తప్పదు మరి, ఆ సమాచారాన్ని అందించే మాధ్యమాలలో బలమైనది బలోపేతంగా తయారవుతోంది పోటీగా మరోటి వచ్చేదాకా అది రాజ్యమేలుతుంది - టీవీ వచ్చేదాకా రేడియో వర్ధిల్లినట్టు!

అయితే టీవీ నేడు సమాజానికి విడదీయరాని అనుబంధంగా మారినా కొందరు పిచ్చిగా కావలించుకుంటుంటే, మరికొందరు తీవ్రంగా వ్యతిరేకిస్తున్నారు ఎవరి కారణాలు ఏమైనా, మరో ప్రత్యామ్నాయం వచ్చేదాకా దీని గురించి సంయమనంతో వ్యవహరించకతప్పదు టీవీ మంచిని కల్గిస్తుందా? చెరుపు చేస్తుందా? అని నిర్ణయించుకునే ముందు చాలా అంశాలు పరిశీలించాల్సి వుంది కానీ, చర్చ అంటే అది ఫలానా చానల్ మంచిదా, ఫలానా చానల్ కార్యక్రమాలు మంచివికావా అని కాదు. ఇది కేవలం ఆ ప్రచార మాధ్యమంతో సహజంగా ఒనగూడి వుండే సౌలభ్యాలూ, సమస్యలూ గురించి ఆలోచించడమే!

## ఎన్నో సౌలభ్యాలూ! మరెన్నో సౌఖ్యాలూ

హాయిగా యింట్లోనే, మంచం మీద పడుకుని సినిమాచూసే అవకాశం వుంటే ఎంత బాగుండేదిరా మనవడా అని ఆశపడ్డ తాతయ్య కళ్ళుమూసి ముప్పయి సంవత్సరాలు కూడా కాలేదు. నేడు థియేటరే పడగ్గదికి వచ్చేసింది ప్రజలవద్దకే నేరుగా వచ్చి, తారతమ్యాలు చాలా తగ్గించి ఎంతో ప్రజాస్వామ్య బద్ధంగా ముందుకు వచ్చింది ఈ టెలివిజన్ అంటే సకుటుంబం కాలుకదపకుండా నట్టింట్లోనే కావాల్సినదంతా పొందే అవకాశం కల్గింది ఇరవైనాలుగ్గంటలూ, కావాల్సిన భాషలో, కావాల్సిన రీతిలో కార్యక్రమాలు పొందే అవకాశం శాటిలైట్ చానళ్ళ రాకతో సాధ్యమయింది ప్రజల భాషలో, ప్రజల చేరువలో, ప్రజలు యిష్టపడే బాణీలో రంజింప చేసే వినోదసాధనంగా మారిపోయింది టీవీ, దాంతో కుటుంబసభ్యులు ఎడమొగం, పెడమొగం కాకుండా ఒకే చోట కలసి కూర్చొని, చర్చించుకునే అవకాశం కల్గిందని టీవీని సమర్థించే వారంటారు. ఎవరికి వారు విడిగా పడుకునే రీతిలో పడగ్గదులు వేరుగా వుండని మన సగటు సమాజంలో సమిష్టి కుటుంబమే శరణ్యం: అందుకే ఒక కుటుంబం పలు టీవీలు కొనజాలదు అందువల్ల టీవీ కుటుంబసభ్యుల మధ్య భౌతికదూరం, తద్వారా మానసిక దూరం తగ్గిస్తోందని ఒక అభిప్రాయం.

ఎవరో చెప్పారు, ఏదో జరిగింది అని కాకుండా మీ కళ్ళకూ, మీ చెవులకూ వారినే, వారి మాటలనే తేవడం - ఆవిషయానికి విశ్వసనీయత కల్గిస్తోంది వారి మాటను వినిపించే సౌలభ్యం వుండే రేడియో, పత్రికలకన్నా ఒక అడుగు ముందుకేస్తే, టీవీ మరో అడుగు ముందుకేసింది. అసెంబ్లీలలో మన ప్రతినిధులు పోట్లాడుకుంటారని చదివాం, విన్నాం. అయితే గత సం॥ ఉత్తరప్రదేశ్ అసెంబ్లీలో నడిచిన పోట్లాటలు మనం బుల్లితెరమీద చూడడంతో కలిగే 'యింపాక్ట్' వేరుగా వుంది గదా! అంతేకాక అది తిరుగులేని సాక్ష్యంగా కూడా పనిచేస్తుంది. మద్రాసులో జరిగిన బాంబుప్రేలుళ్ళు గురించి కాంగ్రెస్ నాయకుడు సీతారాంకేసరి నోరుజారి ఆర్ఎస్ఎస్ దే ప్రాత అన్నాడు. తర్వాత పత్రికల వారిదే

తప్పు అని ( మామూలుగా తప్పించుకోవాలని) అన్నాడు అయితే టీవీ కెమెరా చెప్పిన సాక్ష్యం తిరుగులేనిదవడంతో, కేసరి ఒప్పుకోక తప్పలేదు ఒక రకంగా లాలో విస్తే బలమైన చట్టం కూడా చేయలేనిది యిక్కడ టీవీ చేయగలిగింది అలాకాక ఏది నిజం అంటూ సుప్రీం కోర్టుకు పోయినా యింతవరకు తేలేదికాదేమో! పారదర్శకత యిక్కడ సాధ్యమైంది!

తర్వాత మరో విషయం లైవ్ కవరేజీలు క్రికెట్‌కానీ, ఏడు కొండలవాడి ఉత్సవం కానీ, డయానా అంత్యక్రియలుగానీ, కొత్తప్రధాని ప్రమాణస్వీకారంగానీ, విశ్వాస తీర్మాన పర్వంగానీ - ఎంత మంది నేరుగా చూడగలరు? స్త్రీలు, వృద్ధులు, పిల్లలు అసలు అటువంటి ప్రదేశాలకు వెళ్ళి చూడగలరా? ''క్లోజప్'' లో చూసినట్టు మనం ప్రత్యక్షంగా అయినా అన్ని విషయాలు సూక్ష్మంగా చూడగలమా? అపురూపమైన కట్టడం, అందమైన లోయ, అత్యంత ఎత్తైన శిఖరం, అతి ప్రమాదకరమైన మృగం - యిలా దేని దగ్గిరకయినా వెళ్ళగలమా? పరికించగలమా? ఇదికేవలం టీవీ వల్లనే సాధ్యమయింది!

ఉదాహరణకు వార్తా పత్రికల్లో రావాలంటే వ్యవధి పడుతుంది రాయాలి, అచ్చువేయాలి తర్వాత మనకు చేరాలి. అయితే టీవీలో వ్యవధి సమస్య అసలు వుండదు జరిగింది, జరిగినట్టే మనకు తెలిసే అవకాశం వుంది అంటే వార్తా పత్రికలో వచ్చే విషయాలు చెప్పబడుతాయి టీవీ ఎల్లప్పుడూ తాజాగా యివ్వగలదు (పాత సినిమా పాటలే మనకు అంటే అది మన దౌర్భాగ్యం ) శాటిలైట్ చానళ్లు, రిమోట్‌లు రావడంతో ఆల్టర్‌నేట్ అభిప్రాయం తెలుసుకోవడానికి అస్కారం ఏర్పడింది వ్యాపారస్థులు పత్రికలు నడపటంతో ఏ పత్రిక అయినా, తన బాణియే వినిపిస్తుంది, తనకు కావాల్సిన వాణియే పలికిస్తుంది అంతేకానీ మరో అభిప్రాయం తెలిసే అవకాశం లేదు మన దేశంలాంటి బీద, నిరక్షరాస్య దేశంలో రెండవ వార్తాపత్రిక కొనడం, చదవడం సాధ్యమా? అయితే కేబుల్ కనెక్షన్, రిమోట్ వుంటే చాలు పదిరకాల చానళ్ల ద్వారా పదిరకాల అభిప్రాయాలు తెలుస్తాయి తర్వాత మీ నిర్ణయం మీరు తీసుకోవచ్చు అంటే సమగ్రత సాధ్యపడిందిగదా!

పోనీ, మొన్న ఎన్నికలనే తీసుకోండి. పోస్టర్లు, నినాదాలు, సభాలు గతంలో లాగా వున్నాయా? లక్షలు ఖర్చుపెట్టినా పత్రికల్లో వార్తలు తప్ప, ఎంత మంది చూడగలరు? అదే టీవీలో అయితే ఎంతో మందిని చేరగలరు అంతేకాదు రాజకీయ సభలో వాడు చెప్పిందే వినాలి, అంతా వన్‌వే ట్రాఫిక్ కానీ మీ అభిప్రాయానికి కానీ, అతనిని వ్యతిరేకించే అభిప్రాయానికి కానీ అవకాశం వుండదు టీవీచర్చలో అలాకాదు అపోజిషన్ వాడు, పత్రికా రచయిత, మేధావి యిలా నలుగురు నాలుగు రకాలుగా ఉతికి ఆరేస్తారు మొన్న జరిగిన ఎన్నికల టీవీ చర్చల్లో ప్యానెల్ సభ్యుల పేర్లు తెలుసుకుని పలాయనం చిత్తగించిన నాయకులు వున్నారు. నేడు టీవీకోసం ట్రయినింగయి సంసిద్ధమవుతున్న రాజకీయ నాయకులున్నారు వాజ్‌పాయిలాంటి సహజవక్త టీవీకోసం తన బాణి మార్చుకున్నాడు అదీ టీవీ గొప్పదనం

ఇలా వినోదం, విజ్ఞానం, వికాసం, విశ్వసనీయత, కాలవ్యవధి లేకపోవడం దగ్గరిదనం వంటివి టీవీ వల్ల సాధ్యమవుతోంది.

## అయితే సమస్యలు లేవా ?

'మహాభారత్' దూరదర్శన్‌లో ప్రసారం అవుతున్న రోజుల్లో ఓ కేంద్రమంత్రి తన సభను

అది(ప్రసారం అయ్యేటైంలో నిర్ణయించుకుని, తీరా ఎవరూ రాకపోవడంతో టైం మార్చుకోవాల్సి ఎచ్చింది ఇంతెందుకు మీకు యిష్టమైన ప్రోగ్రాం మీరు చూస్తున్నపుడు మీ మిత్రుడు వచ్చినా మీరు సరిగా ఒలెవెండవుతారా? అతడికి ఆప్రోగ్రాం గురించి సుత్తికొట్టి మీ సోఫాలో పడేస్తారా? ఇంకా టీవీ ప్రోగ్రాంలో లీనమయి భర్తను, పిల్లలను పట్టించుకోని భార్యలు లేరా? ( మీరు చూసే వుంటారు - ''జీ'' టీవి ప్రకటన దూరప్రాంతంలో వున్న తండ్రి యింటికి ఫోన్ చేస్తాడు వారి సంభాషణలో జీ అనే పదం లగిలితే, చానల్ గుర్తుకు వచ్చి మరలా మాట్లాడుతానని ఫోన్ పెట్టి టీవీ ఆన్ చేస్తాడు) అంటే మానవ సంబంధాలకు సంబంధించి యిది ఒక విఘాతం అయిందని ఎంతోమంది విశ్లేషకులు అంటున్నారు

టీవీ చూడటంలో నిమగ్నమయి ఆలోచనకు, సృజనాత్మక శక్తికి తిలోదకాలు యిస్తున్నారని మరికొంత మంది వాపోతున్నారు ఇన్సోమ్నియా, డిప్రెషన్, లావుకాయం, అతి భోజనం, అజ్ఞానం, అర్థం లేని వినిమయ ధోరణి మొదలయిన సమస్యలు వున్నాయని విశ్లేషణలు వస్తున్నాయి అతిగా చూడటం వల్ల మెదడులోని న్యూరాన్లకు సంబంధించి జబ్బు అమెరికాలో తీవ్రంగా వుందని దాదాపు ఎనిమిది సంవత్సరాల క్రితమే నివేదికలు వచ్చాయి. గత డిసెంబరులో జపాన్‌లో దాదాపు 729 మంది పిల్లలు టీవీ కార్టూన్‌షోలు చూసి ఆస్పత్రిపాలయ్యారు ఇది అంతర్జాతీయస్థాయిలో వార్తాంశం అయ్యింది యునెస్కో దాదాపు 23 దేశాల ( భారత్‌తో సహా) లోని దాదాపు 5000 మంది 12 సం॥ బాలబాలికలను సర్వే చేసింది. వారు ' టెర్మినేటర్' లాంటి సినిమాలతో ప్రభావితమై ప్రశాంతతను కోల్పోతున్నారని విశదం అయ్యింది, దాంతో ఇన్సోమ్నియా, నెర్వస్‌నెస్, తలనొప్పికి కారణం టీవీయేనని వెల్లడించారు

టీవీనట్టింట్లోకి రావడంతో జనాలు లోపలికివస్తే, ప్రక్కకు కదలడం లేదు నిర్లిప్తంగా, అనాసక్తంగా తయారవుతున్నారు. వార్తాపత్రికలు సైతం చూడటం లేదు ఇక పుస్తకాలు అసలు చదవడం లేదు. మనరాష్ట్రంలో సైతం టీవీల రాకతో కాలక్షేప సాహిత్యం కొనుగోలు, ప్రచురణ బాగా తగ్గిందని ప్రచురణ కర్తలు చెబుతున్నారు సృజనాత్మకతకు పెద్దపీటవేసే చదివే అలవాటును హరింపచేస్తోంది టీవీ అనీ, అదే పెద్ద సమస్య అని సోషియాలజిస్టులు, సైకాలజిస్టులు అంటున్నారు

వార్తా పత్రికల్లో మనకు అవసరం లేని ప్రకటనలను వదిలి చదువుకోవచ్చు కానీ టీవీలో అలావీలుపడదు ప్రకటనగదా అనీ, మనదృష్టి మళ్ళిస్తే కార్యక్రమం పోవచ్చు జరిగిపోయిన కార్యక్రమం మరలా తెప్పించుకోలేం. అందువల్ల ప్రోగ్రాం కావాలంటే ప్రకటనలు తప్పనిసరిగా చూడాలి. దీనివల్ల మరో సమస్య అంటే అర్థం లేని 'కన్స్యూమరిజం' పెరిగిపోవడం. ( వినియోగదారుడు రాజు అన్నది పాతమాట, వినియోగదారుడి కొడుకు రారాజు అన్నది కొత్తమాట) అందంగా చూపించినవన్నీ కొనాలని భ్రమపడడం, ఆశపడడం జరుగుతుంది. అంతేకాక టీవీలో చూసేదే అసలయిన సమాజం అనే భావంతో కొత్త తరం ఆలోచనా ధోరణికూడా తయారుకావచ్చు.

## మరికొన్ని సమస్యలు

ఇంతవరకు టీవీ మాధ్యమంతో సహజంగా వున్న సమస్యలు చర్చించుకున్నాం ఇతర కళలు నాశనం అవడం, పరాయిసంస్కృతి దురాక్రమణ చేయడం, వలెంటీన్స్‌డే లాంటి సందర్భాలకు పెద్ద

ఎత్తున ప్రచారం సాగడం, శాంతాబార్బారాలాంటి కార్యక్రమాలు రావడం, సినిమాపాటలతో మోహం మొత్తించడం, చౌకబారుహాస్యం, నేలబారు హర్రర్‌షోలు, అసంగతమైన క్షుద్రరచనలు, అశాస్త్రీయమైన జోతిష్యం, స్త్రీని తక్కువచేసి చిత్రించడం అన్నవి కూడా చిన్న సమస్యలు కాదు భారతీయ సమాజంలో టీవీ గురించి యింకా విస్తృతంగా అధ్యయనం చేయాల్సి వుంది

ఇన్ని సమస్యలు, యింత తీవ్రంగా వుంటే టీవీని నిరోధించగలమా? మీ యింట్లో టీవీ కొనకపోతే, టీవీవున్న పక్కింటికి పోతాడు మీ పిల్లవాడు. అది పిల్లవాడి ప్రవృత్తికాదు మానవ ప్రవృత్తి, అట్లని మూర్ఖంగా టీవీని నిరోధించగలమా? టీవీ వల్ల కలిగే సత్ఫలితాలను కళ్ళుమూసుకుని నిరోధించగలమా? అది అంత ఆరోగ్యకరమా? టీవీ లేని సమాజం తయారుకాగలదా? అది సాధ్యమవుతుందా? అది సవ్యమైనదా? అని కూడా ఆలోచించాలి!

1995 నుంచి ఏటా ఏప్రిల్ 22నుంచి 28దాకా ఏడురోజులపాటు టీవీ కట్టేసే వారోత్సవాలు జరుగుతున్నాయి. టీవీని ఆఫ్ చేసినపుడు కనబడే తెల్లని చుక్క (వైట్‌డాట్) చిహ్నంగా అమెరికాలో ఒక ఉద్యమం మొదలైంది నేడు అది బ్రిటన్, కెనడా, డెన్మార్క్, ఆస్ట్రేలియా, న్యూజిలాండ్ దేశాలకు కూడా ప్రాకింది టీవీ తలనొప్పి భరించలేని ఒకవ్యక్తి మూడవ అంతస్థునుంచి టీవీని విసిరివేయడంతో ఈ ఉద్యమం మొదలైంది ఇటువంటిది మన దేశంలో కూడా రావాలా? వస్తుందా?

డబ్బులు, చెప్పుల గురించి ఓ సామెత వుంది చెప్పులు చిన్నవయితే కరుస్తాయి, పెద్దవయితే పడదోస్తాయి అలాగే డబ్బులు తక్కువయితే సమస్యలు, ఎక్కువయినా సమస్యలు ప్రస్తుతం ఈ జాబితాలోకి టీవీ చేరుతోందా? టీవీని మూర్ఖంగా వ్యతిరేకిస్తే కాలం చెల్లిన వాళ్ళుగా మారిపోతాం! అట్లని గుడ్డిగా కావలించుకుంటే మానసిక వికలాంగులం అవుతాం మరి పరిష్కారం ఏమిటి? టీవీతో మనం వేలంవెర్రిగా కొట్టుకుపోవడమా? లేదా జాగ్రత్తగా, మనకు తగిన రీతిలో టీవీని మనం తీసుకుపోవడమా? అదిమనం ఆలోచించుకుని, నిర్ణయించుకోవాల్సిన సమయం ఆసన్నమైంది! వీక్షకుల సంఘాలు రావాల్సిన తరుణం దగ్గరకొచ్చింది!!

Continued Page No 23

This is the second time in over a decade that the Karolinska committee has been accused of corruption in awarding the prize. In 1993, the committee was accused of accepting material favours, from a multinational drug company to award the Nobel prize in medicine to Italian scientist Dr. (Mrs) Rita Levi Montalcini. Despite vehement denials to the Press in this regard, the charges have not yet been officially refuted.

However, Dr. Michael G. Koch voices a charge against Dr. Stanley B. Prusiner, that is near unprecedented in academic circles and, hitherto, inconceivable, in Noble tradition, and that too, on the eve of the August royal ceremony. "(The 1997) Nobel prize winner is bluff," he writes. "It is a scientific swindle that has won the prize."

Charges against Dr. Montalcini surfaced seven years after the prize was awarded to her.

# రామాయణంలో పిడకలవేట

## (స్వయంప్రభా వృత్తాంతము)

- కె.ఎమ్.వి.జి. కృష్ణమూర్తి

ప్రధానమైన విషయవర్ణలో, అప్రధానమైన విషయాన్ని సందర్భశుద్ధి లేకుండా చెప్పడాన్ని 'రామాయణంలో పిడకలవేట' అనడం పరిపాటి

ఐతే రామాయణంలో కూడా పిడకలవేట లాంటి సందర్భం ఒకటి ఉంది. అదే స్వయంప్రభా వృత్తాంతం రామాయణంలో కిష్కింధాకాండలో 48వ సర్గ నుంచి 53వ సర్గదాకా ఈ కథనం ఉంది

సుగ్రీవుని ఆదేశానుసారం వానరులు నాలుగు దిక్కులకూ సీతాన్వేషణకై బయల్దేరతారు హనుమంతుడు, అంగదుడు, నలుడు, నీలుడు, గజ, గవయుడు, గవాక్షుడు, మైందుడు, ద్వివిదుడు, జాంబవంతుడు మొదలైన వానర ప్రముఖులు దక్షిణ దిశాగా వెడతారు

తారాంగదాది సహితః ప్లవగో మారుతాత్మజః
అగస్త్య చరితామాశాం దక్షిణం హరియూథపః (45వ సర్గ)

కిష్కింధాకాండలో భౌగోళిక వర్ణన మనకు అంతుబట్టని విధంగా ఉంటుంది ఈ వర్ణన ప్రకారం కిష్కింధకు దక్షిణాన వింధ్యా పర్వతశ్రేణి, దానికి సమీపాన దక్షిణ సముద్రతీరం ఉండాలి పానుగంటివారు ఒక వ్యాసంలో వాలిసుగ్రీవుల యుద్ధం నేటి విజయనగరం (హంపీ) వద్దగల ఆనెగొంది వద్ద జరిగి ఉండవచ్చుననీ, అక్కడ సుగ్రీవుడు గుర్తుకై రాముని ఆదేశానుసారం మెడలో వేసుకున్న గజపుష్పలత నేటికీ తామర తంపరగా పెరుగుతుందని చెప్పారు బ్రహ్మనిర్మితమైన ఋష్యమూక పర్వతాన్ని, దానిపై గల గుహలో వసించమని కబంధుడు రామునకు చెప్పేసందర్భంలో

'సదుఃఖారోహణో నామ శిశునాగాభి రక్షితః

తస్యాగుహాయాః ప్రాగ్ద్వారే మహాన్ శీతోదకో హ్రదః

అక్కడొక గుహ కలదనీ ఆగుహ ముందు చల్లటినీటి హ్రదం ఉందనీ చెపుతాడు కష్టముతో ఎక్కగలిగిన సార్థకనామంగల ఆ కొండను రోకలి బండలు రక్షిస్తున్నాయంటాడు ఆనెగొందివద్ద గల ఒక కొండపైన అటువంటి గుహ ఉందనీ, అందులో సారంగం లాంటి మార్గంలో దాదాపు వంగుని పాకుతూవెడితే చల్లటినీటి ధార కనబడుతుందని, వర్షాకాలంలో ఆగుహామార్గంలో రోకలి బండలు విరివిగా కనపడతాయని చెపుతూ, ఎక్కడో తమసా నదీతీరంలో తపస్సు చేసుకుంటున్న నీకు ఇవన్నీ ఎలా తెలిసాయని, వాల్మీకిమహర్షి విషయపరిజ్ఞానానికి పానుగంటివారు ఆశ్చర్యపోయారు తమ వ్యాసంలో. కాని దక్షిణదిక్కును వర్ణించిన తీరులో లోపాలను(?) విమర్శకులు అంతగా పట్టించుకున్నట్టు కనుపడదు. కీ॥శే॥ సురవరం ప్రతాపరెడ్డిగారితో సహా (చూ॥ రామాయణ రహస్యాలు). ఈ విషయాలమీద వ్రాయాలంటేవేరేమరో వ్యాసం అవుతుంది

ఇంక అసలు విషయానికి వద్దాం. దక్షిణంగా వెళ్లిన వానర బృందము వింధ్య పర్వత ప్రాంతానికి చేరుకుంటుంది

సతుద్వారము పాగమ్య సర్వస్తేఃక పిసత్తమైః
విచినోలిస్మ విన్ధ్యశ్చ గుహాశ్చగహనానిచ (46వసర్గ)

వింధ్య పర్వత శిఖరంపైనుంచి సీతకోసం చూస్తారు. కనపడదు కొండదిగి అలసిపోతారు దాహం ఆకలివేస్తుంది ఒక గుహద్వారం నుంచి పక్షులు తిరుగుతూంటే, లోపల నీటి వనరు ఉండొచ్చని వానరులందరూ ఆగుహ లోకి వెడతారు

గిరిజాలావృతాన్దేశాన్మార్గిత్వాదక్షిణాం దిశమ్
వివిన్యస్తత తస్తత్రదదృషుర్విృతం బిలమ్
దుర్గమృక్ష బిలం నామదాన వేనాభిరక్షితమ్
క్షుత్పిపాసా పరీతాశ్చ శ్రాన్తాశ్చ సలిలార్థినః (కి కాండ 50వ సర్గ)

లోపల సర్వ కాంచనమయమైన ఒక సుందరోద్యానవనాన్నీ, కాంచన, రత్న, మణిమయమైన సుందర భవనాన్నీ చూస్తారు కొంచెం దూరంలో తపస్సు చేసుకుంటున్న అందమైన యువతిని చూస్తారు

దదృశుర్వానరా శ్శూరాః స్త్రీయంకాంచిద దూరతః
తాపసీం నియతా హారాం, జ్వలన్తీమివతేజసా

. .

ప్రపచ్ఛ హనుమాస్తత్ర కాసిత్వం కస్యవాబిలమ్
ప్రపచ్ఛ కాత్వంభవనం బిలంచరత్నాని హేమానికస్య (కి కాం 50వ సర్గ)

ఆమె ఈ విధంగా జవాబిస్తుంది·

. .

'పురాదానవ ముఖ్యానాం విశ్వకర్మ భభూవహ
యేనేదం కాంచనం దివ్యం నిర్మితం భవనోత్తమమ్
సతువర్ష సహస్రాణి తపస్తప్త్వామహావనే
పితామహాద్వరంలేభే . ...

రాక్షస శిల్పిమయుడు వెయ్యి సంవత్సరాలు తపస్సుచేసి, బ్రహ్మ వరాని ఈవనాన్ని పొందాడని, తనకూతురు స్వయంప్రభకోసం ఈ భవనాన్ని నిర్మించాడనీ, తనే ఆస్వయంప్రభనీ వారికి చెపుతుంది

తరవాత వాళ్లామె ఆతిధ్యాన్ని పొంది తమ క్షుత్పిపాసలు తీర్చుకుంటారు గుహలోంచి బైటపడే మార్గం అడుగుతారు. వాళ్లనుకళ్లు మూసుకోమని చెప్పి, వాళ్లా విధంగా చేయగానే అందరినీ బైటకు జేరుస్తుంది వాళ్లు సముద్ర తీరాన ఉంటారు

'ఏషవిన్ధ్యో గిరిశ్రీమాన్నానా ద్రుమలితా కులం
ఏషప్రస్రవణశ్శైలసాగరోయం మహోధ ధిః

గుహలోంచి బైటకు వచ్చేటప్పటికి నెలరోజులు గడచినట్లు తెలుసుకుంటారు సుగ్రీవుడు పెట్టిన గడువు దగ్గరపడుతోంది జానకి కనపడలేదంటే చంపేస్తాడు ఇంతకంటే ఇక్కడే చావడం మేలనుకుంటారు

ఈ దానవ తపస్వినీ బిల ప్రవేశ - నిర్గమనం నిజంగా రామాయణంలో పిడకల వేటలాంటిదే నెలరోజులు వృధా అయిన ఈ ఉదంతం వెనక ఎలాంటి రాచకార్యం కాని, దేవ కార్యంకాని లేవు

# పునరపి జననం - పునరపి మరణం?

– డా॥ దేవరాజు మహారాజు

హిందూ మతం, జైనమతం, బౌద్ధమతం ఇట్లా భారతదేశంలోని చాలా మతాల సారాంశం ఒకటే - మనిషి తన కర్మఫలం అనుభవిస్తూ పుడుతూ, చస్తూ ఉండాలి! అతని ఖాతాలో పాపాలేవీ లేకుండా అయ్యేంత వరకు అంటే మోక్షం సాధించే వరకు ఇది జరుగుతూనే ఉండాలి! మోక్షం అంటే - విముక్తి అది దొరకడం చాలా కష్టం ఎందుకంటే గత జన్మలోని పాపాలకు ఫలితం అనుభవించడమే ఈ జన్మలో చేయాల్సిన ముఖ్యకార్యక్రమం, అయినప్పుడు - ఈజన్మలో చేసే పాపాల్ని వచ్చే జన్మలో పరిహారం చేసుకోవాల్సి ఉంటుంది ఇలా పాప పరిహారం కోసం నిరంతరం జన్మలెత్తుతూనే వుండడాన్ని మన మతాలన్నీ సమర్థించాయి అందుకే దైవచింతన, సమాజ శ్రేయస్సు, అహింస వంటి వాటి ద్వారా పాపాల్ని తగ్గించుకుని, దైవ సన్నిధికి చేరుకోవాలని మనిషి తాపత్రయం.

''ఆత్మనో మోక్షార్థం జగద్ధితాయచ'' - అని అన్నారు అంటే నీ నుండి నువ్వు విముక్తి పొందడానికి ఈ ప్రపంచానికి, సమాజానికి మేలు చేయడానికి బతుకు! అదే నీ ధ్యేయం అని చెప్పారు కొద్దిపాటి తేడాలతో మతాలన్నీ ఈ విషయాన్నే చెబుతున్నాయి కర్మ సిద్ధాంతం, పునర్జన్మ అనేవి నిజానికి మనం అనుకునేంత సులభమైనవి కావు వాటిని అర్థం చేసుకునే ప్రయత్నంలో ఒకదానిని మించిన సంక్లిష్టత మరొకటి ఎదురవుతుందే తప్ప, ఏదీ స్పష్టంగా ఉండదు ఎందుకంటే అవి కొన్ని వర్గాల వారు కావాలని చేసిన ప్రచారాలమీద, ఋజువుల్లేని నమ్మకాల మీదా ఆధారపడి ఉన్నాయి కాబట్టి గత జన్మలో చేసిన పాపాలకు శిక్ష ఈ జన్మలో అనుభవించడం నిజమే అయితే ఏమెరుగని పసికూనలు పురిటిలోనే ఎందుకు చనిపోతున్నారు? పాపపుణ్యాల వ్యత్యాసం తెలియని స్థితికదా అది? ఒక స్వరూపాన్ని సంతరించుకోక ముందే తల్లి గర్భంలోనే మరణించే గర్భస్థ శిశువుల మాటేమిటి? ఆ ప్రాణం - ఆ ఆత్మ పునర్జన్మ ఎత్తినట్టా? లేక మోక్షం సాధించి స్వర్గానికి వెళ్ళినట్టా? అతిక్రూరులైన పెద్ద మనుషులు కొందరు సిరిసంపదలతో, భోగభాగ్యాలతో తులతూగుతూ వున్నారు కదా? మరి వారి మాటేమిటి? సత్ప్రవర్తన గలవారిలో కొందరు కటిక దారిద్ర్యంలో అల్లాడిపోతున్నారే? దానికి కారణమేమిటి?

మనం చేసే మంచి పనులకు, చెడు పనులకు ఫలితం ఈ జన్మలోనే లభిస్తుందన్న అభిప్రాయం కూడా ఒకటి ఉంది దీన్నే 'కార్య కారణ సంబంధం' అని అన్నారు ఉందో లేదో తెలియని రాగల జన్మల్లో ఫలితం లభిస్తుందనే అభిప్రాయం కంటే, ఈ అభిప్రాయం కొంత మెరుగైనదే- కాని చెడ్డవారు ఈ సమాజంలో శిక్ష తప్పించుకుంటూనే ఉన్నారు. అమాయకులు అనవసరంగా శిక్షలు అనుభవిస్తూనే ఉన్నారు 'ఇదంతా సామాజిక, ఆర్థిక వ్యవస్థ లొసుగులు కనబడకుండా పునర్జన్మ, కర్మ సిద్ధాంతాలతో కప్పేయాలని కొందరు చేస్తున్న అందమైన ప్రయత్నమే తప్ప, మరేదో కాదు' అనే విషయం ఏ కొద్దిమంది వివేకవంతులో అర్థం చేసుకోగలుగుతున్నారు.

సమాజగతిని తమ ఇష్టా రాజ్యంగా నడపాలనుకునే అగ్రవర్ణాల వారు, ధనవంతులు, ఇతర వర్ణాల' వారికీ, పేదవారికీ చూపించే బూచాడు - దేవుడు! ఈ దేవుడనే భయం చుట్టూ అల్లిన విషవలయాలే పాపం, పుణ్యం, పునర్జన్మ, కర్మసిద్ధాంతం వగైరా. సమాజంలో దోపిడీకి గురవుతున్న వారిచే, వీటన్నిటిని నమ్మించాలని సహజంగా దోపిడీ వర్గం నిరంతరం కృషి చేస్తుంది. వారిని మానసిక దుర్బలులుగా తయారు చేస్తేనే తమ ధ్యేయం నెరవేరుతుందని వారికి బాగా తెలుసు. అందుకని వాళ్ళే ఎక్కువగా భక్తి ప్రదర్శిస్తారు. పాపభీతి గల వాళ్ళుగా భయం నటిస్తారు. పూజలు చేస్తుంటారు. సత్పురుషుల్లా నటిస్తూ వేదాంతాలువల్లెవేస్తుంటారు. అందుకే 'మంచిగా ప్రవర్తించండి అగ్ర వర్ణాల వారికి, ధనికులకూ సేవలు

చేసుకుంటూ వుండండి. పుణ్యం సంపాయిస్తూ ఉండండని' నూరిపోస్తూ ఉంటారు నిజానికి బాధలో వున్నవారికి స్నేహ హస్తాన్ని చాపి దరికి తీయడమే మానవత్వం! ఫలాపేక్ష లేని సహాయమే ఉత్తమమైంది మరి అలాంటప్పుడు ఎవరికో సేవచేసి, దానికి ఫలితంగా ''పుణ్యాన్ని'' ప్రతిఫలంగా పొందడం మానవత్వం కాదు గదా? మానవత్వం పై అచంచలమైన విశ్వాసం ఉన్నవారు పాపపుణ్యాల గురించి ఆలోచించాల్సిన అవసరమే లేదు.

భక్తుడికి, దేవుడికీ మధ్య ఉండేవి బేరసారాలే! ఏమీ ఆశించకుండా దేవుణ్ణి ప్రార్థించేవారు ఉంటారన్న నమ్మకం లేదు. ఒకవేళ ఉంటే వాళ్ళు అదే శ్రద్ధను సమాజం వైపు మళ్ళించి, ఏమీ ఆశించకుండా తోటివారికి సహాయపడొచ్చు. ఒకరకంగా భక్తులు, సన్యాసులు అనబడే వారిలో వుండే స్వార్థ చింతన సామాన్యుల్లో ఉండడం లేదు. ఇది సమకాలీన సమాజంలో మనం అనునిత్యం చూస్తూనే ఉన్నాం. స్వార్థ చింతన బాగా ఉన్నవాడే కర్మ సిద్ధాంతాన్ని నమ్మినట్లు నటించి, ఇతరులు ఆ గోతిలో పడేట్లు చూస్తున్నాడు. మోక్షం అనేది సాధించే దాకా మనిషి పుడుతూనే ఉంటాడని, మోక్షం సిద్ధించిన తర్వాత స్వర్గలోకం చేరి అక్కడ సుఖంగా ఉంటాడని . పూర్వం నుండి మనవాళ్ళకో అభిప్రాయం ఉంది. ఇదిగాక, పుణ్యం చేసుకున్న వాడే మనిషి పుటక పుడతాడని, పాపం చేసిన వాడు ఏదో ఒక నికృష్టజీవిగా పుడతాడని మరో అభిప్రాయం ఉంది ఇలాంటి అభిప్రాయాలు నిమ్న జాతుల వారు ప్రచారం చేయలేదు చేయక పోవడానికి కారణం చదువురాకపోవడమే అవగాహనా రాహిత్యమే! అగ్రవర్ణాల వారితో తొక్కిపెట్టబడి ఉండడమే. అయితే అగ్రవర్ణాల వారు కావాలనే తమ ఆధిపత్యం చలాయించుకోవాలని ఇలాంటి అభిప్రాయాల్ని ప్రచారం చేసి, జనాన్ని భయపెడుతూ వచ్చారు. మనిషి అనే జీవి ఈ భూమి మీద రూపుదిద్దుకుని కొన్ని మిలియన్ సంవత్సరాలైంది కొన్ని మిలియన్ల మంది పుట్టారు గిట్టారు. వీరిలో ఒక్కడంటే ఒక్కడు స్వర్గలోకం చూసి వచ్చి అనుభవాలు చెప్పలేదు. వీరిలో ఒక్కడంటే ఒక్కడు గతజన్మలో తాను గేదెగా పుట్టాననో, కోడిగా పుట్టాననో చెప్పుకోలేదు. పూర్వజన్మ వృత్తాంతాలు చెప్పుకునే వారంతా తాము గత జన్మలో మనుషులమేనని చెప్పుకుంటున్నారు. అది ఇక్కడ గుర్తుంచుకోవాల్సిన అంశం. 'మోక్షం' అనేది ఏమిటో ఎవరూ ఇంతవరకు నిర్ధారించలేదు. ఎప్పటికైనా ఎవరైనా పొరపాటున అటు స్వర్గం నుండో ఇటు నరకం నుండో ఊడిపడితే మనం వారిని ఇంటర్వ్యూ చేసుకుని విషయాలు తెలుసుకోవచ్చు అప్పటిదాకా అలాంటివేవీ లేవని హాయిగా ముందుకు సాగిపోతే తప్పేమిటి? అలాగే పూర్వజన్మ వృత్తాంతాలని కొందరు చెప్పే 'కతలు' నమ్మని వాళ్ళయితే వారికి ఏ ఇబ్బందీ లేదు నమ్మే వాళ్ళయితే మనుషులు మనుషులుగానే పుడుతున్నారన్నది గమనించాలి.

మనుషులు మనుషులుగానే పుడతారు జంతువులు జంతువుల్లాగానే పుడతాయి అనే అభి ప్రాయానికి మనం రానక్కరలేదు. మనమిక్కడ అర్థం చేసుకోవాల్సిన విషయం మరొకటి ఉంది. మనిషయినా, జంతువైనా, సూక్ష్మ క్రిమి అయినా, పరాన్నజీవయినా, వృక్షాలయినా - భూమి మీద బతికే ఏ జీవికైనా కొంత జీవితం ఉంది. జీవితంతో పాటు జీవిత చక్రమూ ఉంది. జనన మరణాల మధ్య ఒక జీవి ఒక నిర్ణీత కాలంలో నిర్వహించే జీవన ప్రక్రియల సారాంశమే జీవనయానమే - జీవితం! ఈ జీవితం అన్ని జీవులకూ ఒకే విధంగా లేదు. కొన్ని జీవులు కొన్ని గంటల పాటు జీవిస్తే, కొన్ని కొన్ని సంవత్సరాల తరబడి జీవిస్తున్నాయి. కాల వ్యవధి ఏమైనా జీవుల జీవిత చరిత్ర ఒకే పంథాలో నడుస్తూ ఉంది

పర్యావరణ శాస్త్ర పరిధిలోంచి మనం జీవుల్ని గమనిస్తే ప్రతిజీవి పుడుతుంది, పెరుగుతుంది, సంతానోత్పత్తి చేస్తుంది, చనిపోయి మట్టిలో కలుస్తుంది ఇందులో ఒక్కోసారి ఒక్కోజీవి పూర్తిగా

జీవించకుండా మరో జీవికి ఆహారమైపోవచ్చు అట్లా ఆహారంగా స్వీకరించిన జీవైనా తన జీవిత చక్రం పూర్తి చేసుకుని మట్టిలో కలవాల్సిందే ఒక్కోసారి జీవి ప్రమాదవశాత్తూ మధ్యలోనే తనువు చాలించాల్సి రావొచ్చు రోగంతోనో, నొప్పితోనో ప్రాణం వదిలేయవచ్చు ఏమైనా చివరకు మట్టిలో కలవడంతోనే జీవిత చక్రం పూర్తవుతుంది చనిపోయిన జీవులన్నింటితో భూమిలో లవణాలు, ధాతువులు తయారవుతున్నాయి అవే కొత్త తరం జీవులకు ఆధారభూతాలవుతున్నాయి ఈ చక్రం ఇలా కొనసాగుతూ వస్తోంది పునరపి జననం - పునరపి మరణం అంటే మనం ఈ విధంగా అర్థం చేసుకోవాలి పాప పుణ్యాల గొడవలు, కర్మ సిద్ధాంతాలు, మోక్షసాధనాలు ఇక్కడ లేవు జనన మరణాలు ప్రకృతి ధర్మాలు ఇవి ఒక వృత్తంగా ప్రకృతిలో పరిభ్రమిస్తున్నాయి 'జీవుల చావు పుట్టుకలు నిరంతరం కొనసాగుతూనే ఉంటాయన్న' విషయాన్ని వక్రీకరించి, ఒక జీవి జన్మతర్వాత జన్మ ఎత్తుతూనే ఉంటుందని అబద్ధాలు చెప్పారేమో? లేదా అజ్ఞానాన్ని పెంచారేమో? లేదా స్వార్థ చింతనతో నిజాల్ని దాచారేమో - ఆలోచించాలి. తరం తర్వాత తరం నిరంతరం కొనసాగుతూనే ఉంటుంది జీవి మరణించినా జీవితం కొనసాగుతూనే ఉంటుందన్న సత్యాన్ని మనం తెలుసుకోవాలి ( దీనిలోంచే బహుశా ఆత్మకు చావులేదనే అభిప్రాయం రూపుదిద్దుకుని ఉంటుంది. )

'పూర్వ జన్మార్జితం పాపం వ్యాధి రూపేణ జాయతే' -

పూర్వ జన్మలో పాపం చేసుకున్నవారికి ఈ జన్మలో వ్యాధులు సంక్రమిస్తాయని ఆ పాపాలు అట్లా పరిహార మవుతాయని ఒక అభిప్రాయాన్ని మన వాళ్లు ప్రచారం చేశారు వ్యాధులు ఎలా సంక్రమిస్తున్నాయన్న దాని గురించి మనకిప్పుడు స్పష్టమైన అవగాహన ఉంది జెనటిక్ ఇంజనీరింగ్‌లో ఎంతో అభివృద్ధి సాధించిన మనం, వంశపారం పర్యంగా జబ్బులు ఎలా వస్తున్నాయన్నది అర్థం చేసుకోగలుగుతున్నాం. సాధ్యమైనంత వరకు నివారించుకోగలుగుతున్నాం పుట్టుకతో అంగవైకల్యం ఏర్పడితే పూర్వజన్మలోని పాపఫలితం అని ప్రకటించే ఈ పెద్దమనుషులు ఒక విషయం ఆలోచించాలి ఆ అంగవైకల్యాన్ని సర్జను ఆపరేషను చేసి సరిచేస్తున్నాడుకదా? అంటే గత జన్మలోని పాపఫలితాన్ని ఈ జన్మలో సర్జను అంటే ఒక మానవ మాత్రుడు భగవదనుగ్రహం వల్ల సరిచేయగలుగుతున్నాడని సర్ది చెప్పుకోవాలా? సత్పురుషులు, సదాచార సంపన్నులూ అయిన వారిక్కూడా వాతావరణ కాలుష్యం వల్లనో, విషాహారం వల్లనో, కలుషితమైన నీటి వల్లనో, గాలివల్లనో, అంటువ్యాధి గల రోగి ద్వారానో రోగాలు సంక్రమిస్తున్నాయి కదా? వీటిని కూడా ఇనిస్టెంట్ పాప ఫలితాలుగానో, ఇనిస్టెంట్ కర్మఫలితాలుగానో భావించాలా?

జనన మరణాలకు పాపపుణ్యాలకు సంబంధాలు అంటగట్టినట్టుగానే, వ్యాధులకు పాపాలకూ సంబంధం అంటగట్టారు. నిజానికి ఇందులో వాస్తవాలు కొన్ని, కల్పనలు అనేకం - జనన మరణాలు - వ్యాధులు వాస్తవాలు, మిగిలినవి కల్పనలు, వాస్తవం వాస్తవంతో కలుస్తుంది కల్పన కల్పనతో అతుకుతుంది. వాస్తవానికి కల్పనకూ లంకె కుదరదు అందుకే ఈ ప్రశ్నలు తలెత్తుతున్నాయి మన వెనుకటి తరాలవారు ఎన్నో వ్యాధులకు మందులు లేక చనిపోతుండేవారు ఈనాడు ఆయా వ్యాధులకు మంచి మందులు లభ్యమౌతున్నాయి. వైద్య శాస్త్ర పరిశోధనల ఫలితంగా జీవితాన్ని పొడిగించుకోగలిగే అవకాశాలు ఏర్పడ్డాయి అంటే మన వెనకటి తరాల వారికన్నా ఈ తరం వారు పుణ్యాత్ములనా దీని అర్థం? జనాభా పెరుగుదలవల్ల, పోటీవల్ల, నైతిక విలువలు హరించుకు పోవడం వల్ల, సమాజంలో ఈనాడు చెడు పెరిగిపోతోంది! ఇలా చెడును పెంచి పోషించే ఈ మనుషుల్ని మరి పుణ్యాత్ములని అందామా? ఆలోచించండి.



*A 1 5-ton heavy and 3-metre-high Prometheus sculpture which was installed on the Eagle Rocks of Sochi where, Prometheus was chained The sculpture was designed and made by Alexander Kapralov, an artiste from Omsk.*